## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలుపైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలుపైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100067418

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భక్తకబీర్

పాండవాజ్ఞాతవాసము, ప్రమీలార్జునీయము, భక్తతుకారాం,
రామదాసు, దానవీరకర్ణ మున్నగు నాటకముల రచించిన

**మద్దూరి శ్రీరామమూర్తికవిగారిచే**

రచింపఁబడియె.



పబ్లిషర్సు:

**కొండపల్లి వీరవెంకయ్య,**

సత్యనారాయణబుక్కుడిపో,

రాజమండ్రి.

మొదటికూర్పు 2000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1936.



[వెల రు. 1—0—0.

# పీ ఠి క

మద్విరచితములగు భక్తిరస ప్రధానములగు నాటకములలో నియ్యది నాల్గవది. హిందూ మహమ్మదీయసమ్మేళనమునకై యత్నించు భక్తశిఖామణులలో కబీర్ మహాశయుఁడే ప్రథమమున గణింపదగిన వాఁడు. ఈతనిచారిత్రమును నాటకరూపమున వ్రాసి యాంధ్రలోకమున కర్పించినాడను.

కబీర్ మహాశయునిపై గల భక్తితాత్పర్యమునకైన యీ గ్రంథ మును పాఠకమహాశయు లాదరింతురని విశ్వసించుచున్నాను.

ఇట్లు,
సుజనవిధేయుడు,
మద్దూరి శ్రీరామమూర్తికవి.

10-1-1936.
కాకినాడ.

# ఈ నాటకమున వచ్చుపాత్రలు.



1. కబీరు.
2. తమాలు.
3. రామానందులు.
4. కమాలు.
5. జ్ఞానదేవులు.
6. నామదేవులు.
7. పులక్ప్రకారు.
8. వినయశీలుడు.
9. తారాచరణుడు.
10. సుగుణచంద్రు.

## స్త్రీలు.

1. సుశీల.
2. విలాసిని.
3. సుందరి.

మరియు బ్రాహ్మణులు మున్నగువారు వత్తురు.



శ్రీరస్తు

శ్రీమదుమామహేశ్వరకృప.

# భక్తకబీర్

## నాంది.

శా. శ్రీమంతుం డమలుం డమేయుఁడు శుభశ్రీమందు లోకావళీ
క్షేమంకారుఁడు భక్తవత్సలుఁడు యోగిధ్యానమానైక శో
భామూలస్థితుఁ డవ్యయుం డజుఁడు సర్వవ్యాపియై యొప్పి చె
ల్వాలీలం దగు రామమూర్తి దయ నుద్యద్భక్తులం బ్రోవుతన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(సపుష్పాంజలుఁడై ప్రవేశించి) భక్తజనమానసో
ల్లాసా! శ్రీనివాసా!

సీ. ఆశేషభోగి పర్యంకంబు విలసిల్ల
సనకాది సన్మునీశ్వరులు గొలువ
సిరియు ధరిత్రియు నురమునందలరంగ
శంఖచక్రములు భుజంబులడర
వైజయంతీదామ మోజను బెంపార
సాధురక్షితమైన చక్రమడర
దక్షితామరలోక మక్షియుగం బొప్ప
నభయప్రదానమహా హస్తమమర.

నలువ నాభిజ తేజంబునన్ జెలంగఁ
గలశపాథోధిఁ బేరోలగంబుగనెడు
శ్రీదయాశాలి శౌరి యాశ్రితపరుండు
భక్తవిజయంబు నొందించు బ్రత్యహంబు.

నటీ ! నీవింకను రాకుంటివేమి ?

నటి—[ప్రవేశించి] ఆర్యా ! నమస్కారము; ఈసభాస్తారులు మీకొసంగుమని యొకలేఖ యిచ్చిరి. తత్ప్రసంగవిషయమై కొంతకాలయాపనమైనది; క్షమింపుఁడు.

సూత్ర—ఏదీ ?—

నటి—ఇదిగో. (లేఖఁదీయును.)

సూత్ర—భక్తిరసావేశపరవశంబున స్వస్థతఁ గానరాకున్నది. నీవే చదువుము.

నటి—(లేఖవిప్పి) చిత్తము.

"నిరంతరనాటకఖేలన పరాయణుండ"వగు నో సూత్రధారుఁడా !

గీ. బహుళ భక్తిరసావేశ పరవశంబు
మతములన్నిటి లోన సమ్మతము గలది
భక్తవిజయాభిజనకమై పరఁగు నట్టి
చిరనిరంతర కథఁబ్రదర్శింపవలయు."

సూత్ర—అట్లనా ? అట్టికథ యేదియున్నది ?

నటి—లేకేమి ? ఇప్పటి కీయాంధ్రభాషాలతామతల్లికయం దనేక నాటకకుసుమంబు లుద్భవించియున్నవికదా ! అందెయ్యదియైనఁ బ్రదర్శనార్హమై యుండదా ?

సూత్ర—అగునగును. మంచిజ్ఞాపకముచేసితివి ! అనేకనాటకములన్న స్ఫురణకు వచ్చినది. అది ప్రదర్శించుటయే సమంజసమని తోఁచుచున్నది .

నటి—ఏదది ?

సూత్ర—నీకింకను స్ఫురణకు రాలేదా ?

నటి—లేదు.

గీ. ఉరుగుణుడు వెలనాటి శాఖోద్భవుండు
ప్రథితయశుడు మద్దూరి శ్రీరామమూర్తి
సుకవి దారచియించె నాటకములెన్నొ
నవల లెన్నియొ, మఱి ప్రబంధములుగొన్ని.

నటి—ఇంకేమి ? "కొండ తలక్రిందనిడుకొని ఆళ్లకై వెదకినట్లు" మఱి పరిభ్రమింతురేల ? సరేకాని, యాకవివిరచితనాటకములందేది యిప్పుడు ప్రదర్శింప నుద్దేశించితిరి ?

సూత్ర—భక్తిరసప్రపూరితమగు భక్తకబీరునాటకముఁ బ్రదర్శించుట భావ్యము.

నటి—అట్లైన కాలయాపన మొనరింపక పాత్రధారణమునకై లోని కేగుదమురండు.

(నిష్క్రమింతురు.)

తెరపడును.

---

# భక్తకబీర్

## ప్రథమాంకము.

---

ప్రథమరంగము:—తమాల్ గృహము.

[తమాల్ - కబీరును దగ్గరకు లాగుకొని గద్దించుచుండును.]

తమా—కుమారా! నీమెడలిపై నుంచిన భూషణము లేమిచేసితివి?

కబీ—(మాటలాడకుండును.)

తమా—(గద్దించుచు) ఏమిమాటలాడవు, ఎవ్వరికిచ్చితివి?

కబీ—(మాటలాడకుండును.)

తమా—చోరు లపహరించిరా?

కబీ—లేరు. లేదు.

తమా—నీతో కపటముగా స్నేహముసేయువారు హరించిరా?

కబీ—లేరు.

తమా—మరేమిచేసితివి?

కబీ—ఆయలంకారములు నిరుపయోగములని—

తమా—అలంకారములు నిరుపయోగములా! ఆ నిరుపయోగము లగువానిని యేమిచేసితివి?

కబీ—భక్తు లగు సాధుజనములకు దానమొసంగితిని.

తమా—ఏమీ!

కబీ—భక్తు లగు సాధువులకు దానమొసంగితిని.

తమా—ఛీ! దుర్మార్గుఁడా!

గీ. సొమ్ములన్నియును నిరర్థకమ్ము లనుచు
యేవిరాగులకో పంచి యిచ్చివైచి
యించుకంతయు మదిసంశయింపబోక
యేల నరుదెంచి యున్నాడ వింటి కిపుడు.

భక్తులగువారల కొసంగితివా? భక్తులకు ధనమేలనని యైన సంకోచింప వైతివా? ఆభక్తులు నిన్ను పోషింతురని తలంచితివా? ఎవ్వరో నిన్ను మోసగించి యాభూషణములను హరించియున్నారు. పోయి యాసొమ్ములనుఁ గొని తెమ్ము.

కబీ—దానపూర్వకముగా నొసంగినవానిని గ్రమ్మర గ్రహింపజాలను.

తమా—గ్రహింపజాలవా?

కబీ—తండ్రీ! ఈయాభరణము లందచందము లపేక్షించువారికి గాని నాకెందులకు. నిత్యానందసామ్రాజ్య మపేక్షించి భగవన్నామ సంకీర్తన మాచరించువాని కీభూషణము లేల; తండ్రీ!

గీ. పుడమి మానుషజన్మంబుఁబొంది జన్మ
సార్థకమగుటకై పురుషార్థములను
యుత్తమంబైన మోక్షంబు నొందుకొఱకు
యత్నముల నెన్నియైన సేయంగవలదె.

ఉత్తమగతు లపేక్షించువారు ఐహికములం దాసను త్యజింపవలయును.

తమా—ఏమి నీయపూర్వోపన్యాసము. పట్టుమని పదియేడుల ప్రాయమైన లేని నీవు పరమును సాధింతునని పలుకుచుంటివి. ఇట్టి విపరీతముల బలుకుమని నీకెవ్వరు బోధించిరి.

కబీ—తండ్రీ! భక్తిప్రబోధ మొక్కరు బోధింప నలవడునా? పరమేశ్వరసాక్షాత్కారము బడసిన యాధ్రువున కెవ్వారు హరిప్రబోధమును బోధించినారు?

తమా—చాలింపు మిక నీయుపన్యాసము. వినుట కసహ్యాకరముగాను నసందర్భముగను నుండు నీపల్కులాలించుచు గూర్చుండుటకు నాకుఁ దీరిక లేదు. సొమ్ముల గంగలో గలిపితివి. ఇంకనైనను బుద్ధిగల్గి ప్రవర్తించుచుండుము. నిన్ను తొలుతనుండియు ముద్దుగా బెంచి యేపనియు జెప్ప కుపేక్షించినందున యీామెట్టవేదాంతము లనేర్చుకొంటివి. నేటినుండి రాట్నముకడ గూరుచుండి నూలు దీయుచుండుము. నూలువడకుటమానితివా క్రూరదండనమునకు బాల్పడెదవు—నేను మరల త్వరలో నరుదెంచెదను. ఇంతలో నెంతనూలుఁ వడకెదవో పరికించెదను. (నిష్క్రమించును.)

కబీ—జనకునిచిత్తమింకను పరిపక్వము గా లేదు. కానిమ్ము ఆత డరుదెంచునంతలో నొకసారి యాశ్రీరామచంద్రుని కీర్తించి యావల తండ్రిచెప్పినట్లుగా నూలు వడకుటకుఁ బ్రారంభింతును.

దండకము:—శ్రీరామ, రామా! జగద్దివ్యనామా! మహోద్దామ సంగ్రామ భీమా! గుణస్తోమ నీరూపువర్ణింపసాధ్యంబె ఘోరాటవిన్ గాలి యాహారమౌనట్లుగానిల్చి నిత్యంబు నిద్రాగరిష్ఠాత్ములై యోగమార్గంబుసాధింప యత్నించు మౌనీంద్రులే నిన్ను వర్ణింపలేరన్నచో మూఢబాలుండనైనట్టి నేనెట్లు వర్ణింపనేర్తున్ కృపాంభోధివై నీపదాంభోజయుగ్మంబులన్ నాదు చిత్తంబునం బాయకొల్పన్ కటాక్షింపవే యిందిరాచిత్తచోరా! భవద్దివ్యనామంబు కీర్తించుభాగ్యంబు చేకూర్పవే నిన్ను సేవించి యానంద వారాసిలోదేలుచుండన్ గటాక్షింపవే ఘోరసంసార తాపత్రయా భీలదావాగ్నికిన్ జిక్కకుండన్ గటాక్షింపవే భక్తలోకైకపాలా నమస్తే నమస్తే నమః.

(ధ్యానమున మునుంగును.)

తెరవ్రాలును.

---

## ద్వితీయరంగము.

[రాట్నముచెంత కబీరు ధ్యానమున మునిగియుండును, తమాల్ దాసు ! అతని భార్యయు దూరమున ప్రవేశింతురు.]

తమా——ఇదేనా ! కుమారుఁడు రాట్నమును వడకుచున్నాఁడంటివే. రాట్నము వడకుట యిట్టిదేనా ?

భార్య——అదేమో చిత్రముగానున్నది. మీరు వచ్చుట కించుకముందు నే నామరుగుననుండి రాట్నపుమ్రోతను స్పష్టముగా వినియుంటిని. కావుననే మీతో కుమారుఁడు రాట్నమువడకుచున్నాడని వచించితిని.

తమా——(కోపమున) కబీర్ ! ఏమిచేయుచుంటివి. రాట్నము వడకక మనిన నిద్రించుచుంటివా ?

కబీ——(ఉలికిపడిలేచి) జనకా ! క్షమింపవలయును. నేను నిద్రించుట లేదు. మనోనయనములకు సాక్షాత్కరించిన యాపరంధాముఁడగు శ్రీరామచంద్రుని స్తుతించుచుంటిని.

తమా——మంచిపనిచేయుచుంటివి. కాలమంతయు నీవిధముగా వృథగావించిన పొట్టగడచుటయెట్లు——చూచితివా ఉదయమునుండియు కష్టపడినను యీవస్త్రమునేయుట పూర్తిగాలేదు. (అని మగ్గము వంకకు జూచుచు.) ఆ. ఇదేమి. ఈవస్త్రమును పూర్తిగానేసి యెవ్వరిట్లు మడతబెట్టియుంచిరి. కబీర్ ! నీ వామగ్గముచెంత కే గనేలేదఁగదా !

కబీ——లేదు.

తమా——అయిన నిది యిచ్చటి కెట్లు వచ్చినది.

కబీ——ఆ శ్రీరామచంద్రుఁ డద్దాని నిచ్చటబెట్టియుండును. నీవు నేయ విడచినభాగమునుగూడ నాతఁడే నేసియుండును. సందేహపడ

కుఁడు. ఆవస్త్రమును నాచేతికిండు. శ్రీరామునివస్త్రము గా
వున యాతని కైంకర్యమునకై యేభక్తునకో యొసంగెదను.

తమా—మంచిపనిచేయుదువు. ఆమాత్రము మేమును చేయగలము.

గీ. ఉన్నదంతయు రామున కొసఁగెదవు కూడ్చిపెట్టి
యొంటిప్రొద్దులతోడ, శుష్కోపవాస
భరముతోడను కష్టసంభరితముగను
జీవనము సేయనుంటివే చెనటిపోల్కి.

ఇన్నిదినములవఱకును నేను శ్రమపడి తయారుచేసినదానిని భక్తులకొ
సంగెదవా ? మనుగడకు మార్గమే యెఱుంగవా ?

కబీ—మనుగడనుగూర్చి మనకంత విచారమేల? ముల్లోకముల సృజింప
బెంప పోషింప నాజగద్రక్షకుఁడుండగా మనమూరక పరితాప
పడు టెందులకు ?

చ. జగతిసృజింప బెంపగను సంహరణం బొనరింపకర్తయై
ఖగపతివాహనుండు కలుగంగ తమకంబున జీవయాత్రకై
యగపడదొక్కమార్గమని యాత్మగతంబున నీవిధాన పె
న్వగగొననేల? దీనజనబాంధవుపాదము లాశ్రయింపుమా.

తండ్రీ! దీనజనబాంధవుండును రఘువంశాబ్ధిసోముడునగు రామచంద్రుని
పాదరాజీవముల నాశ్రయించినయెడల మనుగడనుఁగూర్చి మనంబున
నావంతయు చింతిల నగత్యము లేదు. పుట్టించిన యారాముఁడు పోషిం
పక విడచునా ?

తమా—అట్లని యొకమూలగూర్చున్నయెడల భగవంతుఁ డేపూట
కాపూట నీకన్నముదెచ్చి యొసంగునా? ఏమి నీవెర్రి. ఇట్టి
యసంగతవాక్యము లిఁకఁ గట్టిపెట్టుము.

కబీ—తండ్రీ! నే నసంగతవాక్యము లాడుచుంటినా ?

తమా—నాతో వాదింపకుము. (మగ్గముపైనున్న వస్త్రమునుగొని వచ్చి కబీరునకొసంగి) ఈవస్త్రమును బజారునకు గొనిపోయి విక్రయించి క్రియధనమును గొని తెమ్ము.

కబీ—(వస్త్రమునుగై కొని) జనకా! తమ రాజ్ఞాపించినట్లుగా నిద్దానిని బజారునకు గొనిపోయెదను. అచ్చట నీవస్త్రమును తప్పక విక్రయింపవలయునంటిరే యిది యెట్లుసాధ్యమగును?

తమా—ఒక్క వస్త్రమును విక్రయింపజాలవా?

కబీ—ఎవ్వరును దీనిని గొనుటకు రాకున్న యెడల నేమి సేయవలయును?

తమా—ఇంత చక్కటివస్త్రమును గొనుట కెవ్వరును సంకోచింపరు.

కబీ—ఆవిషయమై యిప్పు డెట్లు నిర్ణయింపగలము.

తమా—నీతో వాదించుట చాలకష్టముగా నున్నది. ఎవ్వరును దీనిని గొనకున్న యెడల నీవు గృహమున కరుదెంచునపు డిద్దానినిగూడ గొనిరమ్ము.

కబీ—ఇట్టికార్యమును అనుభవనీయులగు తమరే—

తమా— నాకు వేరుపనియున్నది. ఈమాత్రపుకార్య మొనర్ప లేవా పోయిరమ్ము. నీ వరుదెంచునంతలో మగ్గముపై నింకొకవస్త్రము బడవైచి నేయుటకారంభింతును.

(తమాలు భార్యతో నిష్క్రమించును.)

కబీ—(అనుబంధమును బాడుచు నిష్క్రమించును.)

---

## తృతీయరంగము.

బజారువీధి:—కబీరు వస్త్రమును బెట్టుకొని కూర్చుండియుండగా తెర లేచును.

కబీ—లీలా మానుషవిగ్రహుండగు శ్రీరామచంద్రుని మహిమావిశేషము లిట్టివని వక్కాణింప నసాధ్యములుగదా? రాముఁడు సమస్త

సద్గుణాభిరాముఁడు, నిర్వికారుఁడు, దీనజనమందారుఁడు, రామ నామామృతమును దనివిదీర గ్రోలని మానవునిజన్మము నిరర్థక మనుటలో నావంతయు నసత్య ముండబోదు.

[ప్రవేశము కొందఱుపౌరులు.]

1 పౌరు—(రెండవవానితో) ఓయీ! ఈవస్త్రమును దిలకించితివా.?

2 పౌరు—(చూచి) బాగుగనేయున్నది. కాని మనవంటివారి కందు బాటులో నుండదు. ఏదో సామాన్యరకమునుగాని యింతవెల గల్గినవస్త్రములను ధరించుటకు మనమేమి భాగ్యవంతులమా?

1 పౌరు—నీభాగ్యము చట్టుబండలుగాను చూచుటకేని నోచుకొన లేదా? ఎంతచక్కగానున్నదో తిలకించితివా?

3 పౌరు—చూచినంతమాత్రమున ధరించినట్లగునా? రండు రండు. యావలికేగి కొనవలసినవానిని గొని వేళయున్నయెడల దిరుగ వచ్చి సావకాశముగా జూడవచ్చును రమ్ము. రమ్ము. ప్రొద్దు పోవుచున్నది.

కబీ—అయ్యలారా! మీ రీవస్త్రమును విలుచుకొందురా?

2 పౌరు—నాయనా! మే మంతటిభాగ్యవంతులముగాము.

(ముందునకు నిష్క్రమింతురు.)

కబీ—ఏమిది? చిత్రముగానున్నది. ఈవస్త్రమును గాంచిన వారెల్లరును తామీవస్త్రమును గొనునంతటి భాగ్యవంతులము గామని వచించుచుండిరి. నేను తొలుత నాజనకునితో వచించినట్లుగా దీనిని విక్రయింపజాలనని తోచుచున్నది. ఏమిచేయుదును. జగద్ర క్షకుఁడగు నాపరాత్పరుఁడే గలఁడు. ఆతనియనుగ్రహమున్న నెట్టికొదువయు లభింపదు.

[ప్రవేశము ఒక బ్రాహ్మణుఁడు.]

బ్రాహ్మ—ఓయీ! ఈవస్త్రముతో నిచ్చటగూరుచుంటివేమి?

కబీరు—అయ్యా! దీనిని విక్రయించుదలంపున నిచ్చోఁగూరుచుంటిని.

బ్రాహ్మ—ఏదీ! పెద్దకాలపువాఁడను యీవస్త్రమెక్కింతజూడనిమ్మా.

కబీరు—పరికింపుఁడు. (వస్త్రమునందించును.)

బ్రాహ్మ—(చూచి) ఇది నీ వనుకొనునంతమంచిదిగాదు గాని వెలయెంత?

కబీరు—విప్రోత్తమా! ఈవస్త్రమునకే వంకలు దిద్దుచుంటిరా? ముద్దలు మూటగట్టునట్లుగా నున్న యీవస్త్రముకంటె నుత్తమమైనది వేరొండుగలుగునా?

బ్రాహ్మ—ఆపరిపాటిమాటలకేమి లెమ్ము. దీనినెంతకు విక్రయింప దలంతువు.

కబీరు—తమరు సర్వజ్ఞులరు. బట్టలనాణె మెఱింగినవారు. అట్టియెడ నేను వెలజెప్పవలయునా?

బ్రాహ్మ—నాణ్యమెఱిఁగినవాడనైనను-నీవు వెలజెప్పకున్న—

కబీరు—నేను జెప్పునదేమున్నది. తమరే వెలనిర్ణయింపుడు.

బ్రాహ్మ—నే నెంతకడిగినను నీకుఁ గష్టముదోఁచును - కావున నీవెంతకు విక్రయింపదలంచితివో మున్ముందుదెల్పుము. నాకావెలనచ్చినయెడల విలుచుకొనియెదను.

కబీరు—నాజనకుఁ డీవస్త్రమును విక్రయించుమని యాజ్ఞాపించెనే గాని యేవెలకమ్మవలయునో దెలుపలేదు.

బ్రాహ్మ—నాకుదోఁచినవెల నొసంగుదును. గైకొనుము.

(రెండు రాగినాణెముల నొసంగును.)

కబీరు—(రిచ్చవడి) భూసురాగ్రణీ!

గీ. మురువుజూపుచుముద్దులు మూటగట్టు
వలువకుఁదగు మూల్యముగ నేఁబులనొసంగి
మోసమొనరించి వస్త్రంబు బొందుకొఱకు
యిట్లు పల్కెదవనుచు నే నెఱుగనొక్కొ.

తమరొసంగనెంచిన యీరెండునేబులకును యొక్క గోచిగుడ్డయైన దొరు
కదు. స్వామీ! తమరిక దయసేయుడు. మీ రిద్దానిని గొనకున్నను
నాకు విచారముండదు.

బ్రాహ్మ—ఓయీ! నీవు దెచ్చినవస్త్రమునకుఁ దగినవెల నిర్ణయించి
తిని. నీమనంబున ననుమానమున్న యెడల నెవ్వరినైన బ్రశ్నింపు
ము. గోచిపాతకైవడి నున్న దీనికింతకంటె నెక్కువవిలువ యొసం
గవలయునా? ఈసమీపమునం దుండువారిలో నెవ్వనినైన
బ్రశ్నింపుము.

ఉ. బాలుడవయ్యు నీవు పరిపాటియొఱింగిన మేటివర్తకుఁ
బోలివచింపసాగితివి ముద్దులుమూటగ గట్టునట్టిరీ
పీలికయున్న దేమొకొ వివేకముగల్గిన వారువిన్ననీ
వేళనుసూడుమాటలను వేగవచింపుము గేలిసేయరే.

ఇయ్యది దుకూలమని భావించుచుంటివేమో యెవ్వరినైన బిలిచివారలకు
జూపింపుము. వారు నేను నిర్ణయించిన వెలకెక్కుడుగా నొసంగుమనిన
సంకోచింపక నొసంగెదను.

కబీరు—భూసురాగ్రణీ! నాకుఁ గన్నులులేవా? ఒకరినిబిలిచి యడు
గుటెందులకు? ఇయ్యది నీకుఁ బీలికగాదోచుచున్నది గాబోలును.
అట్లైన శ్రమపడి సంపాదించి చిరకాలమునుండి దాచుకొనియున్న
నేబుల నేలవ్యయపరచెదవు. వానిని నీచెంతనేయుంచుకొనుము.

బ్రాహ్మ—చాలింపుము. నీవు ప్రొద్దుటినుండియు నిచ్చటనేగూర్చుంటివి
గదా యని కరుణించి వస్త్రమును గొనుటకు వచ్చినందులకు
బాగుగా మాటలాడుచుంటివి. నేను జెప్పినట్లుగా యీరెండు
నేబులనుగ్రహించి వస్త్రమునొసంగుము. అట్లిచ్చుటకంగీకరింపని
చో-నితరులెంతయొసంగెదమని వచించిరో దెలుపుము.

కబీరు—అయ్యా! తమ రీవస్త్రమును విలుచుకొననరుదెంచి యుండలేద నుట విశదమగుచున్నది.

బ్రాహ్మ—వస్త్రమును గొనుటకుఁ గాకున్న మరెందులకు వచ్చితినని దలంచుచుంటివి?

కబీరు—ఈదుకూలమును వెలయొసంగకుండగనే గ్రహింపవలయునను సంకల్పముతో నరుదెంచియుందురు.

బ్రాహ్మ—అశ్లీల తలంచుచుంటివి. నేను రెండుడబ్బులనిచ్చెదనని వచింపలేదా! ఇయ్యది యంత కెక్కుడు వెలగలదిగాను.

కబీరు—రెండు నేబుల నిచ్చెదననుటచేతనే యట్లు తలంపవలసివచ్చుచున్నది.

బ్రాహ్మ—పోనిమ్మట్లే తలంపుము.

కబీరు—ఇంక నీ వేడుక బేరము లెందులకు—

బ్రాహ్మ—వస్త్రము నూరక గొనుటకు వచ్చితినంటివిగదా? కానిమ్మది యే నిక్కువము గావించెదను. నిన్నీ వస్త్రమును నాకిమ్మనియర్థించెదను.

కబీరు—మహాశయా! తమవంటివారర్థించుచుండగా లేదని వచించుట లగ్గుగాదనుటెఱుంగుదును. కాని ఇయ్యది నావస్త్రముగాదు. దీనిని విక్రయించి ద్రవ్యమునుదీసికొని గృహమున కేగవలయును లేకున్న నాజనకుఁడు కోపించును.

బ్రాహ్మ—ఓయీ! నేను చక్కగా చదువుకొనినవాడను. నాయట్టిపండితుఁడు ప్రతిగ్రహీతగా లభించుట నీ పూర్వపుణ్య విశేషమని తలంపుము.

చ. చదివితినెల్లశాస్త్రముల సాంతముగా గురువర్యుచెంత నిం
పొదవగృహస్థధర్మముల బొందితి పేదరికంబుచేత నా

పదలమునింగియుంటిని కృపాపరత౯ కరుణించినేను యీ
ముదుసలిపండితాగ్రణికి పుట్టమొసంగి సమాదరింపవే.

కబీరు——నే నస్వతంత్రుడను. తమకొక్క వస్త్ర మొసంగిన పుణ్యమేయగు
నైనను తండ్రియాజ్ఞకు భిన్నముగ వర్తింపజాలను.

బ్రాహ్మ——ఓయీ! నిక్కము వచించుచుంటిని. ఇంకనీకు నాయట్టి ప్రతి
గ్రహీత లభింపడు. ఇపుడు నాపల్కు లాలింపకున్నయెడల ముం
దుముందు నీవే విచారింపగలవు.

చ. పలువురచెంత కేనరిగి పల్మరువేడెడి వాడగాను ని
ర్మలహృదయంబుతో బిలచు మాన్యులపొంతకుగాక వేరుచో
టుల కరుగంగబోను కొసంగడు మెత్తనివాడ నాకు నీ
వలువ నొసంగినంతనె శుభంబులుపెక్కులు గల్గు నమ్ముమా.

కబీ——అయ్యా! తాము మహానుభావులు. మీవాంఛితమీడేర్పకుండుట
భావ్యముకాదు. తండ్రి దండించు ననుభయమున నింతవరకు సం
కోచించు చుంటిని. కానిండు. నాజనకునకు నేనెట్లోసమాధాన
మొసంగుదును. ఈవస్త్రమునం దర్ధభాగమును గొనుడు.

(వస్త్రమును త్తరించి యొసంగును.)

బాహ్మ——(గైకొని) వత్సా! సంతసించితిని. నీవు పరమభక్తాగ్రేసరుడ
వయ్యెదవు; గాని గురువర్యునను గ్రహములేకున్న నభివృద్ధి గాం
చుట దుష్కరముకావున వారణాశీపురవరంబున నుండురామా
నందులవారి నాశ్రయింపుము. పొమ్ము నీకు శుభమగును.

(బ్రాహ్మణుడు నిష్క్రమించును.)

కబీ——ఈభూసురాగ్రణి వచించిన పలుకులం గొంత సత్యమున్నది. గురు
జనసేవనమునగాని పరమార్థము చేకూరదు. ఆతడు చెప్పినచొ
ప్పున వారణాసీ క్షేత్రమున కరిగి రామానందులనే యాశ్రయిం
చెదను. కాని వారణాసికేగుటకుదగిన యుపాయ మాలోచింప

వలయును. (ముందునకు జూచి) ఏమిది. అపుడే తమం బెల్లెడల నలము కొనినది. వర్తకులెల్లరును తమతమవస్తువులు సరుదుకొని గృహాభిముఖులగుచున్నారు. ఇంకనిచ్చటచేయదగిన దేమున్న ది. శేషించిన యీవస్త్రమును గొనిచని జనకుని క్షమింపవలసి నదిగా ప్రార్థించెదను.

(నిష్క్రమించును.)

---

## తురీయరంగము.

[ఒకవీథి:—బ్రాహ్మణ వేషధారియగు శ్రీరాముఁడు, తమాలు.]

తమా—అయ్యా! అంగడివీథియం దొక వస్త్రము నమ్మొటకు బంపబ డిన నాకుమారుని దిలకించియుంటిరా?

బ్రాహ్మ—చూచితిని.

తమా—ఆతఁ డావస్త్రమును విక్రయించెనా ?

బ్రాహ్మ—లేదు వస్త్రమును విక్రయించినయెడల నీవరకే గృహమున కరుదెంచియుండును.

తమా—అయ్యది విక్రయింపబడకున్నను- యీవరకింటికి జేరుకొనవ లదా?

బ్రా—వస్త్రము విక్రయింపలేదు. దానమొసఁగి యుండెను.

తమా—ఏమి! వస్త్రమును దానమొసంగెనా?

బ్రా—అగును. కావుననే యింటికి రాకుండెను. ఒకబ్రాహ్మణునకు సగము ముక్కను, వేరొకఫకీరున కొకముక్కను దానమొసంగి రిక్త హస్తములతో నింటికరుదెంచిన నీవు దండింతువేమోయను భయమున నొక్కచో తలదాచుకొని యుండెను.

తమా—తమ కీవృత్తాంతమంతయును నెట్లు దెలియ వచ్చెను?

బ్రా— ఆతఁడు ఫకీరునకు వస్త్రమొసంగుసమయమున నేను చెంతనే యుంటిని. ఆసమయమున నాయిరువురకును జరిగిన సంభాషణము వలన కొంతవరకు దెలియఁగల్గితిని.

తమా—ఆతఁడు దాగొనియుండె నంటిరే!

బ్రా—కుతూహలమున నాతనిని గొంతవరకు వెంబడించితిని.

తమా—ఆతఁ డిప్పు డెచ్చటనుండెనో దెలుపగలరా?

బ్రా—తెలిపినందువలన ప్రయోజనమేమి. నే నాతనిని జూపించెదను. నా వెనువెంటరమ్ము. కాని యాతని నేమిచేయ నెంచితివి?

తమా—చక్కగా బుద్ధిగరపుదును.

బ్రా—మంచిది. రమ్ము నీకాతనిఁజూపెదను.

(ఇరువురును పరిక్రమింప తెరయెత్తబడును.)

[ఒకగుడిసెయందు కబీరు గూర్చుండి యుండును.]

బ్రా—తమాల్! జూచితివా! కబీరు డెచ్చటనుండెనో దిలకించితివా? పొమ్ము. ఆతని నావస్త్రమును గూర్చి ప్రశ్నింపుము.

తమా—కబీర్! అచ్చట గూరుచుండి యేమిచేయుచుంటివి? రమ్మా వలకు. ఇంత చీకటిపడునంతవర కింటికేల రాకుంటివి?

(కబీరు వెలి కరుదెంచును.)

తమా—ఏమి మాటలాడవు?

కబీ—(నిరుత్తరుఁడై యుండును.)

తమా—వస్త్రమును విక్రయించితివా?

కబీరు—లేదు.

తమా—ఏదావస్త్రమునిటుదెమ్ము.

కబీ—తండ్రీ! యావస్త్రమును దానపూర్వకముగా నొసంగితిని. రామచంద్రుని కటాక్షమున లభించినదానిని రామచంద్రునకే యర్పించితిని.

తమా —ఓరీ! మూర్ఖా! నీకెప్పుడు జ్ఞానము గలుగును ?

గీ. పూటగడచుటకేనియు సే భక్తి లేక
నవయుచుంటివి మటంచు మనసంబులోన
దలపబోవక వలువను సే దానమిచ్చి
వైచువార లున్నారె యీవసుధలోన-

నీయట్టివారిజగానని కెన్నండును గలుగరనుట నిక్కము.

కబీరు—తండ్రీ! ఆగ్రహింపకుము.

తమా—ఛీ దుర్మతీ! ఆగ్రహింపవలదనుచుంటివా? నేను నీ కేమనిచెప్పి పంపియుంటిని. నాయానతి నేల యతిక్రమించితివి? ఐశ్వర్యమున తులతూగువారలు చేసిన దానము చేయవచ్చునుగాని మనబోట్లా దానమిచ్చుట?

కబీ—తండ్రీ ! పొరబడుచుంటిమి. ఐశ్వర్యముగలవారలు ఐశ్వర్యగర్వంబున క్రిందుమీదెఱుంగక కడుపే కైలాసమనుకొని తమ జీవితమునకు పరమావధి ధనసంపాదనమని తలంచి పిడికెడు బిచ్చమైనను బెట్టజాలరు.

తమా—(క్రరతో కబీరునుగొట్టి) పిట్టకొంచెము కూత ఘనమనినట్లుగా వాగగలవు.

బ్రా—(స్వగతమున.) తమాలునకు కుమారు డెంతటి భక్తాగ్రేసరుడో దెలియుటలేదు. ఆతడు కబీరునకొసగిన యాప్రహారము నాశరీరమునకు దగిలినట్లయ్యెను.

కబీ—రామచంద్రప్రభో ! రామచంద్రప్రభో !

(బ్రాహ్మణుడు శ్రీరాముని రూపమును ధరించును.)

కబీ—జయ్ ! శ్రీరామచంద్రమూర్తికీ జయ్.

తమా—ధన్యోస్మి. ధన్యోస్మి.

కబీ—శ్లో. జయజయ రఘురామ శ్రీముఖాంభోజభానో
జయజయ రఘువీర శ్రీమదంభోజనేత్ర
జయజయ రఘునాధ శ్రీకరాభ్యర్చితాంఘ్రే
జయజయ రఘువర్య శ్రీశ కారుణ్యసింధో.

శ్లో. ఆనందనందమరుణాధర మంబుజాక్షు
మాపీతవస్త్రమతసీ కుసుమోజ్వలాంగం
అశాంతవర్ణ మతలంతమ మేయమాద్య
మత్యాకృతిం రఘుపతింశరణంగతోస్మి.

శ్లో. స్మితాననంపద్మదళాయ తేక్షణం
వినీల మాణిక్యజితాంగశోభితం
జటాకిరీటంశరచాప లాంఛనం
నమామ్యహంభానుకులాబ్ధిసోమం.

తమా—అపరాధిని స్వామీ! కటాక్షింపుము.

శ్రీరా—తమాల్! ఊరక పుత్రవ్యామోహామునబడి యేలవిచారించె దవు. ఈతడు పరమభక్తాగ్రేసరుఁడు. ఈతనిని తక్షణము వారణాసి కంపుము. అచ్చట రామానందు లను గురువర్యుల నాశ్రయించి తారకమంత్రోపదేశమును బడసి ధన్యుఁడు కాగలఁడు.

తమా—మహాప్రసాదము. (శ్రీరాముఁ డంతర్ధానుఁ డగును.)

కబీ—

శ్లో. కోదండదీక్షాగురుమాదిమూలం। గుణాశ్రయంచందనకుంకుమాంకం
సలక్ష్మణం సర్వజనాంతరస్థం। పరాత్పరం రామమహం నమామి.

కబీరుపాడుకొనుచు ముందుగ నేగుచుండగా వెనుకతమాలు నడచుచు యిరువురును నిష్క్రమింతురు.

(తెరవ్రాలును.)

---

# భక్తకబీర్

## ద్వితీయాంకము.

---

ప్రథమరంగము.

[ఒకవీధి .—విశ్వనాథం, నారాయణశాస్త్రి సోమావ
ధాని మున్నగు పౌరులు.]

నారా—విశ్వనాథంగారూ! ఈవిషయంలో మనం వూరుకుంటే లా
భంలేదు.

సోమా—ఊరుకోడమెందులకు. రామానందులవారిదగ్గరకేగి "యే
మండి మీరు తురకలకుగూడ గురుత్వము వహించుచున్నారే
ఇదిన్యాయమా" అని అడుగుదము.

విశ్వ—అడిగినంతమాత్రాన వొప్పుకుంటాడటయ్యా!

నారా—అయితే నోరుమూసు కూరుకోడమేనా ?

సోమా—మతం మట్టిగొడ్డపాలవుంతూందే ఊరుకోడానికి వీల్లేదు.

విశ్వ—ఊరుకోడంమంచి దంటూనా ?

నారా—అయితే సాధనమేమోగూడా సెలవియ్యండి?

విశ్వ—ఓమాటు ఆయనగారితో యీసంగతి ప్రస్తావించి చూద్దాము.
అప్పటిప్రసంగమును బట్టి తరువాత చెయ్యతగ్గపని ఆలో
చింతాము.

సోమా—ఓమాటు అడగడం, తరువాత......

విశ్వ—ఇది ఓరోజుత్తోటీ ! ఓపూటతోటీ తేలేవ్యవహారమనుకున్నా వాయేమిటి. ఇంతకీ ఆతురకాణ్ణి గట్టిగామందలించి అడిగి చూడా లికూడాను. లేకపోతే నిష్కారణంగా మనమంతా ఆనక యిబ్బం దిపడవలసి వస్తుంది.

నారా—సంగతిసందర్భాలన్నీ తమరు బాగా యోచిస్తారనేగా తమ కీ సంగతంతా తెలియబరచేను.

సోమా—సాధకబాధకములు సరిగా ఆలోచించితేనేగాని వ్యవహారం లోకి దిగకూడదు. ఆనక ఆంక్షలనీ, శ్రీముఖాలనీ బయలుదేరితే కొంప నట్టేట్లో మునుగుతుంది.

విశ్వ—నాకు యింకోవుపాయం తోస్తోంది. ఆపతకంపడిందా అంటే మనమంతా గోడమీదిపిల్లిలా యెలాకావలిస్తే అలా తప్పుకో డానికి అవకాశముంటుంది.

నారా—ఓ ! చెప్పండి, నలుగురికీ బాగుంటుందని నలుగురు ఏకీభవిస్తే అలాజరిగిద్దాము.

విశ్వ—అతఁడు తురకాడుగదా ?

సోమా—అవును.

విశ్వ—తురకలకు మతాభిమానము హెచ్చు, కావున ఒక్క ఖాజీకి పురెక్కించినయెడల యిందలి నిజానిజములు బయటబడును.

సోమా—మీరుచెప్పింది నాకర్థంకావడం లేదు.

విశ్వ—(నవ్వి) ఓఖాజీసాయేబుగారితో అయ్యా ! మీతురకవాడో కడు- మహమ్మదీయ మతమును వదలిపెట్టి హిందూసన్యాసికి శిష్యుడై నాడని చెప్పాలి.

నారా—చెపితేమాత్రం లాభమేమిటి? ఒకడుమతంలోనుండి విడిపోయే డంటే అతనికేం, ఆఖాజీగారు మాట్లాడకుండా వూరుకుంటేనో-

విశ్వ—ఊరుకోకుండా చెయ్యాలి. ఒక్కడు విడిపోవడంగాదు మతం. మతమంతా మటుమాయమైపోతుందని చెప్పాలి. చెప్పడంతో చేగాదు. అలాజరుగుతుందని నమ్మించాలి. అప్పుడు కావలసినంత కల్లోలము బయలుదేరుతుంది.

సోమా—బాగుం దీవుపాయం. కాని మన మనుకున్నంతపని దీనివల్ల జరగడం దుర్ఘటము.

విశ్వ—కొంతగొడవ జరుగుతుందిగదా? మూలమూలల్లోవున్న వాళ్లందఱి కీసంగతి వెల్లడౌతుందిగదా? ఆ పైమాట చూచుకొందాము.

సోమా—అనుకొన్నంతఫలితం లేకపోతున్నప్పుడు సంతృప్తిగలుగదు.

విశ్వ—అందుకు సాక్షిగా రామానందులవారు లేరా. తరువాతకావలసినంత గత్తరగలుగజెయ్యవచ్చును.

నారా—మంచిది. కాని మనము మతాభిమానమెక్కువగాగల ఖాజీసాహేబును లోబరుచుకొనుటకు ముందుగా యత్నింపవలయును.

సోమా—ఆభారము నేను వహించెదను.

విశ్వ—ఇం కాలస్యమెందులకు రండాప్రయత్నంలో వుందాము.

(అందరు నిష్క్రమింతురు.)

విష్కంభము.

---

## ద్వితీయరంగము

### రామానందుల యాశ్రమము.

[రామానందులొక వ్యాఘ్రచర్మముపై గూర్చుండియుందురు. నలువురైదుగురు శిష్యులు ప్రక్కగా కూర్చుండియుందురు. తెరయెత్తబడును.]

రామా—సగుణనిర్గుణోపాసనల సగుణమే యుత్తమమైనది. నిర్గుణోపాసకులకుఁ గావలసినంత మనఃపరిపక్వత సామాన్యులకుఁ గలుగుట కవకాశము లేదు. సామాన్యులకు సగుణోపాసనమే కర్తవ్యము.

[ప్రవేశము—విశ్వనాథుఁడు, సోమనాథుఁడు, నారాయణశాస్త్రి.]

విశ్వ—గురువర్యులగు రామానందులవారికి వందనసహస్రములు.

రామా—నారాయణార్పణము, కూర్చుండుఁడు.

(అందరును గూర్చుందురు)

విశ్వ—మహాత్ములగు తమవలన గొన్ని సందేహములు దీర్చుకొనదలంచి యిటరుదెంచియుంటిమి.

రామా—కానిమ్ము.

విశ్వ—సావకాశముగా నాలింపుఁడు. మన సంఘమునుండి జను లితర మతబోధకుల యుపన్యాసములాలించి వారిబోధనలకుఁ జెవియొగ్గి యేల మతాంతరులగుచుండిరి.

రామా—వత్సా! అడుగవలసినదానినే యడిగితివి. ఒకమతమునుండి మరియొకమతములోనికి జనులు మారుచుండుట కనేకకారణము లుండును. తన మతాచారములు తనకనుకూలింపకున్న యెడల సాధారణముగా జనుఁడు తన కనుకూలించు నాచారములుగల మతము నవలంబించుచున్నాఁడు. అట్టాని నరికట్టుట ప్రజాబాహుళ్యముగల మనహిందూదేశమున నసాధ్యము. మరియు,

సీ. అధికారగర్వంబు నావహించుటచేత
స్వేచ్ఛగాదిరుగ బాల్పడెడువారు
ధనసంపదలకల్మి దనరుచుండుటచేత
యిచ్ఛవచ్చినటు చరించువారు
ప్రభువులదయను సంపాదింపగాగోరి
యడుగులకు మడుగులిడెడువారు
భుజశక్తిగల్గి పెంపొందుచుండుటచేత
భీతిలేకను విఱ్ఱవీగువారు
దేశమందున ప్రబలి విదేశమతము
లందున నభిమానమునుగల్గి యార్యధర్మ
ములను నిరసించి తమబుద్ధిపూర్వకముగ
యితర మతబోధకుల నాశ్రయింతురకట.

ఇట్టివారలనుగూడ సరియైనమార్గమునకు గొనివచ్చుట యసాధ్యము.

నారా—మతవ్యాప్తికై యితరమతములవారు యత్నించుచుండగా మనమేల మనమతవ్యాప్తికై యత్నింపరాదు.

రామా—వత్సా! ఇప్పటికే జనబాహుళ్యము గల్గియున్న మనము మరల మతవ్యాప్తికై యత్నింపవలసిన యగత్యమేమున్నది?

విశ్వ—ఇంతకంటె నన్యమగు కారణమేమియును లేదా?

రామా—మరియొక ప్రబలకారణముగూడ నున్నది. చెప్పిపెట్టిన బుద్ధు లెంతకాలము నిలువగలవు. తొలుత తనకనుకూలముగానుండిన యాచారములుగల మతమున ప్రవేశించినవాఁడు తుదకెప్పుఁడో యొకప్పుడామతాచారముల నేవగించుకొనును. కావుననే యార్యులు మతమును నది జన్మతః గలుగునని వక్కాణించి యున్నారు.

విశ్వ—ఇతరమతములోని వారలను మనమతములోనికి జేరనీయవచ్చునా?

రామా —చేరనీయరాదు.

విశ్వ—ఇతరమతములవారికి హిందూమత సాంప్రదాయముల ననుసరించి హిందూదైవతముల నారాధించుమని మంత్రోపదేశమును చేయవచ్చునా ?

రామా—చేయరాదు.

నారా—(నవ్వును.)

రామా—నవ్వెదవేమి?

విశ్వ—ఒకమహమ్మదీయునకు తాము తారక మంత్రోపదేశము గావించియుండిరటగాదా ?

రామా—నేనా?

నారా—స్వామీ! అగును. తమరే మంత్రోపదేశ మొనర్చిరట.

రామా—చెప్పెడివానికి చెవులు లేకున్న వినెడివానికైన వివేకముండవలదా? ఆపలుకులను మీ రెట్లునమ్మిరి ?

విశ్వ—మేము నమ్మితిమో లేదో యావిషయ మట్లుండనిండు. లోకమంతయును గగ్గోలుపడుచున్నది. తలకొకవిధముగా తమ్ముగూర్చి చెప్పుకొనుచున్నారు.

రామా—ఏమని?

విశ్వ—ఒక తురకకు తారకమంత్రోపదేశ మొనర్చిరని.

రామా—ఇట్టిప్రవాదము పుట్టుటకు కారణమేమి?

విశ్వ—ఆతురకయే బహిరంగముగా తాను రామానందులవారి నాశ్రయించి తారకమంత్రోపదేశమును బడయగల్గితినని చాటుచున్నాడు.

రామా—ఇది నిక్కమా?

విశ్వ——తమతో నసత్యమును బల్కుదమా ?

నారా——ఆతురకవానిని దండింపవలయునని గూడ యత్నించి మహా మ్మదీయులను పురికొల్పితిమి. ఆతఁడు వారితో వాదప్రతివాద ముల గావించి వారెల్లరను నోడించెను.

విశ్వ——ఆకారణమున నాతఁడు తమవలననే తారకమంత్రము బడసి యుండెనని లోకమంతయును దలంచుచున్నది.

రామా——చిత్రముగానున్నది. ఆతనిపేరెవ్వరు?

నారా——కబీరు.

రామా——ఆతని నెప్పుడును జూచినట్లు గూడ జ్ఞప్తి లేదు. కానిండు. ఆత నిని నేనే యడిగిజూచెదను.

విశ్వ——అట్లు గావింపవలసినదని ప్రార్థించుచుంటిమి.

నారా——ఉపేక్షించిన యపాయము గలుగును. సంఘమునకు సంభవించి న యాపద యింత నంతట దీరునది గాదుగదా ?

రామా——ఉపేక్షించు టెందులకు. ఆతనిని నాకెప్పుడు జూపగలరు.

సోమా——ఎప్పుడో యననేల. తమ రిప్పుడు మాతోనరుదెంచిన యాత నిని జూపగలము.

నారా——ఈప్రక్కవీధిలో నాతఁడు రామనామసంకీర్తనమే మోక్షసా మ్రాజ్య మందుటకు త్తమసాధన మని ప్రబోధించుచున్నాఁడు.

రామా——అయిన నాలస్య మెందులకు లెండు. ఇప్పుడే యాతనిని మంద లించి వత్తము.

(అందఱును నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

ఒకవీధి.

[కబీరుపాడుచుప్రవేశించును.]

కబీరు—(పాడుటచాలించి.)

సీ. రామచంద్రునిపాద । రాజీవయుగళ సం
సేవయే ముక్తిని । జేర్చుపథము
రామచంద్రుని దివ్య । నామసంకీర్తన
మే యపవర్గ మి । ప్పించుగురుఁడు
రామచంద్రునిగుణ । స్తోమమాలించుట
యానందమొనగూర్చు । నట్టిహితుఁడు
రామచంద్రుని కన్ను । లకు నింపుగదిల
కించుటే ముక్తి ని । కొప్పించుతండ్రి
కాన తుచ్ఛములగు నైహి । కములజిక్కి
వెతలబడకుండ రాముని । ప్రేమమయుని
భక్తిమీరంగ మీమనః । పద్మమందు
నిలిపి పూజించి వేగ సత్ఫలముగొనుఁడు.

రామచంద్రుఁడు ముల్లోకాభిరాముఁడు, సుగుణాభిరాముఁడు, జానకీరాముఁ డత్యంతసులభుఁడు, తన్నునమ్మిన భక్తకోటికి సాన్నిధ్యమిచ్చికాపాడునంతటికారుణ్యమూర్తి, శరణుగోరినయంతపగవానితమ్మునకు- విభీషణునకు లంకారాజ్యమొసంగి యాదరించెను. ఇంతకంటె కరుణాళుఁ డెండైననుండునా? ఎంగిలిఫలములనర్పించిన శబరికి నపవర్గమిచ్చిన దయాగుణుఁడు-తననామ మనవరతంబును భక్తితో స్మరించునట్టి భక్తులయాపదలడంచి, సంసారసాగరమునందు మునుంగకుండ నరసిరక్షించుచు తుదకు దనసాన్నిధ్యమొసంగుననుటలో నతిశయోక్తిలేదు. సోదరులారా! రామనామామృతమును తనివిదీరగ్రోలి యానందింపుఁడు.

[ప్రవేశము రామానందులు మున్నగువారు.]

నారా—స్వామీ! ఈతఁడే కబీరు.

రామా—పరికించితిని.

(కబీరు రామానందులనుగాంచి నమస్కరించును.)

కబీ—గురుదేవునకు కబీరునామధారియగు శిష్యుఁడు నమస్కరించుచున్నాఁడు.

రామా—కబీర్! నీపలుకులు నీ చేతలవలె విచిత్రముగా నున్నవి!

కబీ—స్వామీ! అట్లు సెలవిచ్చెదరేల?

రామా—నీవు తురుష్కుఁడవై యుండియు రామనామము జపించుచుండుట చిత్రముగాదా? ఇంతేగాక నీవు నాకు శిష్యుడవని వచించుచుంటివిది కడుంగడుచిత్రముగా నున్నది.

కబీ—మహాశయా! నేనుయథార్థముగా తమ శిష్యుఁడనే యగుదును. కావుననే యట్లు పలికియుంటిని. తమవలననే నేను తారకము బడసియుంటిని.

రామా—నీకు నే నుపదేశము గావించితినా? ఇట్లసత్యము లాడకుము. మావంటివారు నీ యట్టితురుష్కునకు తారకమంత్ర ముపదేశింతురా? ఏల మమ్ములనుగూడ నపయశఃపంకమున గూలద్రోయనెంచితివి?

కబీ—మహాత్మా! నిక్కము వచించుచుంటిని.

రామా—నావలన తారకమునెప్పుడు బడసితివి?

కబీ—స్వామీ! నేను పెక్కామడలదూరమునుండి తమదర్శనార్థమరుదెంచి యుంటిని. తమ మఠముచెంత కెన్నిసారులో యరుదెంచియుంటిని. కాని యేమిలాభము. అచ్చటనున్న విప్రులు తురుష్కుడవగు నీకు స్వాములదర్శనమే లభింపదు. మఠమున కనేకులు వచ్చుచుందురు. నీయట్టియపవిత్రులిందుండరాదు పో

వలసినదని పారద్రోలియుండిరి. అపుడు నేను తమవలన తారక మును బడయగోరి తాము నిత్యమును గంగానదికి స్నానార్థము వేకువనే వెడలుచుందురని విని యాపూసనాడు తమ మార్గమున బడియుంటిని. చీకటిలో నరుదెంచుచు తాము నాశిరముపై పాదమునుంచి యెవ్వనినో దన్నియుంటినను భావమున "రామ రామ" యని వచించిరి. అదే తారకముగా గ్రహించి నిరంతర ము జపించుచుంటిని ఇందువలన నేను తమకు శిష్యకోటిలోని వాడనైతిని.

రామా—ఇయ్యది తారకమంత్రోపదేశమగునా ?

కబీ—మహర్షిసత్తములు వాల్మీకునకుపదేశించినది తారకముగాదా ? అయ్యదియే మంత్రోపదేశమైనప్పు డిదియ్యదిగాకుండునా ?

రామా—విశ్వనాథం! నారాయణశాస్త్రి! మీయనుమానము నివృత్తి యైనదా ?

విశ్వ—అయ్యది మంత్రోపదేశము గాజాలదు. విప్రసత్తముల నెక్క సక్కెములాడుటకు సంకల్పించి యిట్లనుచున్నాడు. ఇట్టివాడు శిక్షార్హుడగును.

కబీ—నేను నిక్కవమెఱింగించితిని. తమ దేశికు విధించినను సంతోష పూర్వకముగా ననుభవించెదను.

రామా—నయవంచనులకు పాదుకాప్రహారమే శిక్ష.

(పాదుకను విసరును.)

కబీ—(తనకు తగిలినపాదుకనుగ్రహించి) స్వామీ ! కటాక్షించితిరి. ఆ నాడు తమరు నాకు మంత్రోపదేశమొనర్చినందులకు సాక్షులు లేరను లోపమునుదీర్చిరి.

విశ్వ—ఓరీ మతద్రోహీ !

[తెరలో]

ఊరకకలహింపకుఁడు. శ్రీశుకుని యపరావతారమగు నీ కబీరు దాసునకు రామానందులు గురువులు. ఇయ్యది పరమాత్ముని నియమానుసారముగా జరిగినది.

రామా—ఆహా! యశరీరవాణిగూడ యీవిషయమున సాక్ష్యమొసంగుచున్నది.

విశ్వ—మహాత్మా! తమయెడ నపచారము గావించితిమి.

(నమస్కరించును.)

రామా—(విశ్వనాథముతో) ఓయీ! నీవు నాయెడ నెట్టియపచారమును గావించియుండలేదు. నీవు మన్మానుగా కబీరుదాసును క్షమాభిక్ష గోరవలయును.

విశ్వ—అయ్యా! నే నొకతురకవానిని క్షమాభిక్షగోరవలయునా?

రామా—వత్సా! విశ్వనాథా! ఏమనుచుంటివి? ఆలెఁడు తురకవాఁడనుచుంటివా? అశరీరవాణి పల్కులాలించియుంటివా? శ్రీశుకుని యపరావతారుఁడని వచించి యశరీరవాణిపల్కులు నీకు వినంబడవయ్యెనా? నీవు వర్ణవిచక్షుత గనుపుంచుచుంటవా? వర్ణవిచక్షుతశరీరములకుగాని యాత్మకు లేదనుట యెఱుంగనా? జీవాత్మకును పరమాత్మకునుగల సంబంధ మొక్కసారి తలంపుము. అగ్రవర్ణుఁడనని భావించుకొనుచుండిన నీయం దేయాధిక్యత గలదో నిరూపింపగలవా? నాయనా! దేహాభిమానమును త్యజింపుము.

విశ్వ—అనుగ్రహింపబడినాడను.

(కబీరునకు రామానందుగాక తక్కినవారెల్లరును నమస్కరింతురు.)

కబీ—సోదరులారా! నాకేల నమస్కరింపవలెను. మీకును నాకును రక్షకుండగు శ్రీరామచంద్రునకు నమస్కరింపుడు. ఏమహా

తున్నాఁడు తన వినోదంబునకై సంకల్పమాత్రమున సమస్తజగం
బుల సృష్టించి, పోషించి, సంహారము గావించుచుండు నాపర
మాత్మునకు, యాపరంధామునకు యాజగన్నాటక సూత్రధారు
నకు, జానకీచిత్తచోరునకు నమస్కరింపుము. అతఁడే మిమ్ములను
నన్నునుగూడ క్షమింపగలఁడు.

రామా——వత్సా కబీర్! నీవు నేటినుండియు భక్తకబీరను నామమును
ధరించి రామదాసుఁవై మతవైషమ్యముల రూపుమాపి హిందూమహ
మ్మదీయోద్ధారకుఁడవై యశంబుగాంచుము.

కబీ——గురుజనంబుల యానతి నిర్వర్తింపబడుఁగాక.

(రామానందులు శిష్యులతో నిష్క్రమించును)

కబీ——

శ్లో. వందే సూర్యశశాంకలోచనయుగం వందేజగత్పావనం
వందేపత్ర సహస్రపద్మనిలయం వందేపురారిప్రియం
వందేరాక్షస వంశనాశనకరం వందేసుధాశీతలం
వందే దేవఃపీంద్రకోటివినుతం వందే సధారాఘవం.

శ్లో. సకలవినుత రత్నం సత్యవాక్యార్ధరత్నం
శమదమగుణరత్నం శాశ్వతానందరత్నం
ప్రణయనిలయరత్నం ప్రస్ఫుటజ్యోతిరత్నం
పరమపదవిరత్నం పాతు మాం రామరత్నం.

(పాడుకొనుచు నిష్క్రమించును.)

తెరవ్రాలును.

---

# భక్తకబీర్

## తృతీయాంకము.

---

ప్రథమరంగము.

విలాసినిమందిరము. విలాసిని యొక సోఫాపై గూర్చుండియుండును.

[వినయశీలుఁడు, తారాచరణుఁడు, సుగుణచంద్రుడున్నుఁ వీరు లుచితా సనములపై గూర్చుండియుండగా తెరయెత్తబడును ]

విన—ప్రేయసీ! ఈదినమున నాయానందమునకు భంగము గల్గింపకుము. నీగానామృతమును నాకును నామిత్రులకును జవిజూపి యిచ్చానందవారాశి నోలలాడింపుము.

విలా—మీ కేమని ప్రత్యుత్తర మీయవలయునో తోచుటలేదు.

విన—ప్రత్యుత్తర మగత్యములేదు. నృత్యగానముల మమ్మానందపరచుము.

విలా—మహాశయా! మన్నింపుఁడు, నృత్యమొనర్పగూడదని కృతనిశ్చయురాలనైతిని. శర్కరాదులను మించి మధురమైన రామనామామృతమును తమకు జవిజూపించెదను

తారా—కృతనిశ్చయురాలవైతివా? ఎప్పటినుండి? ఈవైరాగ్యమున కా కబీరుదాసే కారణుఁడై యుండును.

విలా—అగునను కొనుఁడు. ఆవిషయవిచారముతో నిమిత్తములే

సుగుణ——నృత్యమొనర్చుట కంగీకరింపననుచుండుటచే నింక మాబోంట్ల ను గౌరవింపనని సూచించుచున్నట్లు తలంపవలయునని నీయభిప్రాయమా ?

విలా——అవును. ఈహేయమగు వేశ్యావృత్తిని విడచిపెట్టుటకు సంకల్పించుకొంటిని.

తార——అవును. ఇంక నీవు వేశ్యావృత్తి సాగింపవలసినపని యేమున్నది. వినయశీలుడొసంగినధనరాశు లింట నెక్కడజూచినను మూల్గుచున్నవిగదా ?

విలా——అయ్యో! తా మట్లు తలంచుట న్యాయమే. అయినను నాయభిప్రాయము భిన్నముగా నున్నది.

విన——ఏమది.

విలా——ఏమున్నది.

గీ. వేశ్యనై గూడబెట్టిన విత్తమెల్ల
భక్తిమీరంగ శ్రీరామభద్రునకును
అర్పణముజేసి, యతనిపాదారవింద
సేవన మొనర్పనుంటి నిశ్చింతతోడ.

సుగు——నీయభిప్రాయము మెచ్చదగియున్నది. (నవ్వుచు.) ఎంతటిత్యాగబుద్ధిగలిగినది. దినదినమొక నూతనవిటగ్రామణులతో నుల్లాసంబున దిరుగుచు శృంగారరసాధిదేవతవలె మెలంగి నీయట్టివారకాంత శ్రీరాముని సేవించునట. ఇంకేమున్నది. లోకములు నిలచునా ?

విలా——తమకట్లే దోపవచ్చును కాని మనోనిశ్చయముగలవారి కయ్యది సులభమే.

సుగు——నీమనోనిశ్చయ మెట్టిదో తెల్లముకాగలదు. ఈవరకు బురాణవైరాగ్యము, ప్రసూతివైరాగ్యము, శ్మశానవైరాగ్యములు

మూడుమాత్రమే గలవు గాని యిపుడు ప్రబోధవైరాగ్యము గూడ తలయెత్తుచున్నదిగాబోలును.

విలా—అట్లే యనుకొనుడు. ఇంతమాత్రమున దోసమేమున్నది. మానవుండైనవాం డెవ్వండైనను కబీరుమహాశయునిబోధన మాలించి నపిమ్మట రామచంద్రుని సేవింపక నిలువంజాలండు

విన—విలాసినీ! మేము నీతో వేదాంతప్రసంగము గాంచుట కరుదెంచి యుండలేదు. కామశాస్త్రోపాధ్యాయినివగు నీవు మమ్మానందింపజేతువని తలంచివచ్చితిమి కాని మాకు బాగుగా శృంగభంగము గావించితివి

తారా—వినయా! ఇంకను యీమెచెంతగూర్చుండి ప్రాకులాడుట యెందులకు?

సుగు—ఈపురంబున నీమెయొక్కతెయే గాదు. పలువురు వారాంగనలు గలరు.

విన—విలాసినీ! నేడు నీవు నాకుగావించిన యీపరాభవ మెన్నటికి మరువనని దలంపుము- మేమిక పోయివచ్చెదము.

(ముప్వురును నిష్క్రమింతురు.)

విలా—అజ్ఞానాంధకారపంకనిర్మగ్నులగు వీ రింతమాత్రమున పరిశుద్ధులు గాజాలరు. వీరల నాకబీరుమహాశయుండె యనుగ్రహింపవలయును. (నిష్క్రమింప తెరపడును.)

[ప్రవేశము:- వినయశీలుండు తారాచరణుండు, సుగుణచందు.]

విన—నేడుదయమునగూడ మనసిచ్చి మాటలాడినది. ఇంతలో నీవైరాగ్యమెట్లు గలిగినదో!

సుగు—ఏమున్నది, కబీరుప్రబోధమున-

విన—అయిన మనయానందమునకు భంగమొనర్చినవా డాకబీరని తలంపవలసియున్నది.

తారా—అవును.

విన—అయినయెడల నాతనికొకసారి బుద్ధిజెప్పవలెను.

తారా—ఒకసారి మందలించినయెడల నింక మనయానందమున కెప్పుడు నడ్డురాకుండును. కాని యందులకు సరియైనమార్గము దొరకవల యును.

విన—మనముమువ్వురము ను గూర్చుండి యాలోచించిన మార్గమే దొరక కుండునా ? రండు మాసౌధమునకేగి యీవిషయమునుగూర్చి యాలోచింతము.

సుగు—ఇప్పు డేమంతప్రొద్దుమునుక గల్గినది, శేషుసావకాశముగా నా లోచింతము, సంతోషముగా గడుపనెంచినయీరాత్రిభాగమును నాలోచనలతో తలబ్రద్దలుకొట్టుకొను టెందులకు?

విన—ఇప్పు డేమిచేయుదము.

సుగు—ఈసమీపమున సువర్ణముఖియను వేశ్యగలదు. అచ్చటి కేగు దము రండు.

తారా—ఇంతకంటె యానందకరమగు వినోదముండునా ?

విన—అయినయెడల రండచ్చటకే పోవుదము.

(మువ్వురును నిష్క్రమింతురు.)

తెరవ్రాలును.

---

## ద్వితీయరంగము.

### కబీరుమందిరము

(కబీరు ధ్యానమగ్నుడైయుండగా తెరయెత్తబడును.)

కబీ—(ధ్యానమును చాలించి) రామా ! రఘురామా ! భవద్దివ్యపా దారవిందసంసేవన మాచరించుకొనుచు జీవితశేషమును గడుప

దలంచిన నన్నేల యీ సంసారకూపంబునఁ గూలద్రోసితివి.
ఈ భవాబ్ధినుండి యుద్ధరించుటకు నీవే సమర్థుడవు.

[ప్రవేశము సుశీల.]

సుశీ—నాథా! కుమారుఁ డరుదెంచుచున్నాడు.

కబీ—రాముని కటాక్ష మట్లున్నది.

[ప్రవేశము కమాల్ దాసు.]

కమా—(తల్లిదండ్రులకు నమస్కరించి) జననీజనకులారా! కుమారుఁడు కమాల్ నమస్కరించుచున్నాడు.

సుశీ—(కుమారుని చెంతకుదీసికొని) నాయనా! తీర్థయాత్రలు సేవించు కుతూహలమున నిరంతరప్రయాణముల సాగించి యుంటివా? ఎంతగా కృశించియుంటివి?

కబీ—రామునికటాక్షమున సురక్షితముగా నరుదెంచి యుంటివా? సకలాభీష్టముల నొసంగజాలిన రామతారకరాజ ముండగా పుణ్యసంపాదనమున కరిగియుంటివా ?

కమా—తీర్థయాత్రలకరుగుట నదీనదంబుల గ్రుంకులిడుటయే ప్రధానముగా దలంపలేదు. రామచంద్రచరణారవిందసంసేవనాయత్త చిత్తులగు భక్తాగ్రేసరుల దర్శించుట కేగియుంటిని.

కబీ—కమాల్! తీర్థయాత్రలకరిగి పుణ్యమును సంపాదించుటకు మారుగా పాపమును మూటగట్టుకొని వచ్చియున్నాఁడవు.

చ. చలనములేని చిత్తమున ॥ సర్వఫలప్రదుడైనరాము ను
జ్వలగతి సంస్మరించుటకు ॥ స్వస్తియొసంగిన నీవు తీర్థయా
త్రల కరుదెంచియున్న ఫలితంబు లభింపకపోయె; పాపమున్
వలువను మూటగట్టుకొని ॥ వచ్చితివయ్య కుమార! లోభివై.

కమా—తండ్రీ! అట్లు వచించెద రేల ?

కబీ—కుమారా! నీవు యుత్తరీయమున గొనివచ్చిన యీమూటయం దేమిగలదు.

కమా—(మూటనుజూచి) జనకా! ఇదేమో! యెట్లువచ్చినదో గూడ నేనెఱుంగను.

సుశీ—(మూటనువిప్పి యందుండి యొకరత్నమును వెలుపలకుదీసి) కుమారా! ఈయనర్ఘరత్నము నెచ్చట సంపాదించితివి? ఎవ్వరిద్దాని నొసంగియుండిరి?

కమా—అమ్మా! ఇదెట్లు వచ్చినదో నాకే దెలియదు.

కబీ—నాయనా! రామనామమును విక్రయించి యీగాజుముక్కను గృహంబునకు గొనివచ్చితివా?

కమా—తండ్రీ! అంతటి ద్రోహినిగాను.

గీ. పావనంబైన శ్రీరామభద్రు దివ్య
నామమును విక్రయించి యనర్ఘరత్న
మును గ్రహించునంతటి మూఢబుద్ధిననుచు
నెంచినట్లైన నన్ను శిక్షింపరాదె.

అంతటి విద్రోహ మొనర్చియుంటినని యే దలంపుగల్గినయెడల నీయిచ్ఛ వచ్చినట్లు దండింపుము.

కబీ—ఈ రత్న మెట్లు వచ్చినది?

కమా—విష్ణుదాసను భక్తాగ్రేసరుఁడు కొంతధన మీయనెంచి యెంతయో బలవంత పరచినాఁడు. వలదని నిరాకరించి యుంటిని. ఆతఁడే నాకుఁ దెలియకుండ యీరత్నమును నావస్త్రమునకు మూటఁగట్టి యుండును.

కబీ—అయినయెడ తత్క్షణమేగి యాతని కీరత్న మొసఁగిరమ్ము.

కమా—చిత్తము. (నిష్క్రమించును.)

సుశీ—ఎఱుగక జేసినంతలకు కుమారుని నిందింపనేల?

కబీ—ఎఱింగియో యెఱుంగకో యకార్య మొనర్చినపుడు మందలింప కూరకొనుట తగునా ? ఆతఁ డీకార్యమెఱుంగక గావించి యున్నను మనమారత్నమును స్వీకరించితిమేని యాతఁ డది లగ్గుగా దలంచి ముందుముందట్టే ప్రవర్తింప గలఁడు.

సుశీ—కడుబడలి యింటికరుదెంచినవాని నొక్కదినమైనను విశ్రాంతి దీసికొననీయక మరల నెక్కడికో పంపివైచితిరిగదా?

కబీ—తన్వీ ! ఆతఁడు కష్టపడునేమోయని తలంచితివా ! అట్లే తలంపుము. శరీరము నొకింతకష్టపెట్టినగాని యాతనికి రామనామ మెంత విలువగలదో దెలియుట కవకాశము లేదు.

చ. అతఁ డతిభక్తితో ధరణినాథుపాదములాశ్రయించి సం
తతము భజించువాడగుట సత్యమెయైనను మార్గమందు పె
న్వెతల మునుఁగబోఁడు, కడువేగమవచ్చును అట్లు కానిచో
వెతలమునింగివచ్చును వివేకము గల్గిననాడు నమ్ముమా.

రామనామసంకీర్తనప్రభావమెఱింగినవాడైనచో నెట్టికష్టము లనుభవింపక నేటరేపట రాగలఁడు. కానిచో చెప్పవలసిన దేమున్నది : ఎప్పుడు వివేకముగల్గి రామనామ సంకీర్తనప్రభావ మవర్ణనీయమైనదని గుర్తించి యనుసరించునో నాడే గృహాంబునకు జేరుకొన గలఁడు.

సుశీల—నాథా! నాయభిప్రాయ మదిగాదు. నేడు విశ్రాంతిగైకొని రేపటిదినంబున బోవ సినదని యాజ్ఞాపించి యుండవలసినదని పల్కితిని.

కబీ—ప్రియా! అట్లొనరించుట కానిపని. నేడు చేయదలచినకార్యమును రేపటివరకు నిలుపుటెందులకు. ఈలోపున మనస్సు చలించిన రేపటిదినంబున నాకార్యమొనర్ప జాలకుండును. అంతవరకెందులకు. దానమొసంగునెడ కుడియెడమల భేదము పరికింపరాదనుట నీవాలింపలేదా? నేడు కుమారుడారత్నమును యజ

మానున కర్పింపనంగీకరించెను. రేపటిదినంబున నాతనిచిత్తవృత్తి యెట్లుండునో యెవ్వరు చెప్పగలరు?

సుశీ—ఇంతలోనే నాతనిబుద్ధి మారిపోవునా?

కబీ—ఎంతబేలవు. కాంతాకనకము లాశాజనకములగు ప్రధానము లట్టివి చెంతనుంచుకొనుట నిప్పు బట్టను మూటగట్టుటవంటిదే యగును.

సుశీ—తమ యభిప్రాయము నెఱుంగుటచే సంతసించుచుంటిని. పుత్ర వాత్సల్యమున నేమోయంటిని. క్షమింపుడు.

కబీ—కుమారుండరుదెంచుచున్నాడని విని, అధికవ్యామోహమున రామచంద్రుని పూజించుటయందు త్వరపడి నాకీవార్తదెలుపుట కిట్లరుదెంచి యుంటివిగావున- ఈవ్యామోహమును పారద్రోల వలయునను సంకల్పమునుగూడ మనంబున నిడుకొనియే యాత నిని తక్షణమే యారత్నముచు యజమానున కర్పించి రావలసి నదని యాజ్ఞాపించితిని. నీ వింకనైనను కుమారునియెడగల వ్యా మోహమును తగ్గించుకొనుము. సర్వాభీష్టప్రదుండగు రామభ ద్రుని భక్తితో నారాధింపుము. లెమ్ము. లోనికేగి పూజాద్రవ్య ముల సంసిద్ధము గావింపుము. ఇంతలో స్నానముగావించి యరు దెంచెదను.

(ఇరువురును నిష్క్రమింతురు.)

(తెరవాలును.)

---

## తృతీయరంగము.

### వినయశీలుని సౌధము.

[వినయశీలుఁడు, తారాచరణుఁడు, సుగుణచంద్రు మున్నగువారు సోఫాలపై గూర్చుండియుందురు. వారియెదుట సుందరియను వేశ్య నృత్యముచేయుచుండును తెరయెత్తబడును.]

తారా—సుందరీ! జగదేకసుందరీ! నీనామమును సార్థకము గావించు కొనుచు మ మ్మానందవార్ధి నోలలాడించుచుంటివి. ఏదీ మరియొకజావళీ!

విన—మిత్రమా! సుందరి యొసంగుచున్నయానందము నినుమడింపజేయగల యీసురనుగూడ సేవింపుము.

(గ్లాసులో మద్యమునుబోయుచు)

తారా—సుందరి సుందరలతాతుల్యములగు కెందలిరాకుజేతుల నందించినయానంద మవర్ణనీయముగదా?

(సుందరి మద్యమును తారాచరణున కందించును.)

తారా—ఒకని పరోక్షమున నొకని నెక్కుడుగా గౌరవించుచుండుట మీసాంప్రదాయమైనను సమక్షమున నట్లు గావించుట మర్యాద గాదనుట నీవ యెఱుంగుదువుగదా?

సుంద—మీయిచ్చవచ్చినట్లు పల్కుడు కాని మేమెల్లర నొక్కతీరుననే గౌరవింతుము.

(గ్లాసులలో మద్యమునుబోసి వినయశీలునకును సుగుణచంద్రునకును యందించును.)

విన—హాయిహాయి! భూతలస్వర్గ మనుభవించుచుంటిమి.

తార—కబీరుమహాశయుని యుపదేశ మీసుందరి కింకను గల్గియుండమిచే నీమాత్రపుటానందము ననుభవింపగల్గితిమి.

విన—అవును. నాడు కబీరునకు పరాభవము గావింపవలయునని సంక ల్పించుకొంటిమే! ఇంతవరకావిషయమై యోచన సల్పియుండ లేదు.

సుగు—ఇప్పుడావిషయికమైన యాలోచనముల కవకాశమీయరాదు. అట్లైన నీయానందమంతయును నడుగంటిపోవును.

విన—ఈవిషయమున నాలోచన మగత్యము లేదు. ఇప్పుడాతని నొక్క సారి బిలిపించి ఓయీ! నీరామభజనకంటె మాకామభజన మెక్కు వగా జరుగుచున్నదని వచింతము. అంతతో నాతఁడు బుద్ధితెచ్చు కొనగలడు.

తారా—అట్లు గావించుటయు కొంతవరకు మేలేయగును.

[ప్రవేశము: కబీరు పాడుకొనుచు]

విన—ఇతఁడెవ్వరు ?

కబీ—(పాటచాలించి) అయ్యా! నేనే కబీరుఁడనువాడను. తాము నాకై వర్తమానమంప నూహించుచుందురని నేనే తమచెంత కరుదెంచి యున్నాఁడను. మీకామభజన నిర్విఘ్నముగా జరుగుచున్నందు లకు మి మ్మభినందించుచున్నాను.

విన—నీవా?

కబీ—చిత్తము.

తారా—ఏమిది! మేము తనకై వర్తమానమంపుట కూహించుచుంటి మని యీతని కెట్లు దెలిసియుండును!

విన—నీరామభజనముకంటె మాకామభజనమే నిర్విఘ్నముగా జరుగు చున్నది.

కబీ—అట్లు జరుగుచుండుటయే నీకానందము కాదా? కాని నీయానంద ముమాత్రము నిత్యమైనదిగాదు. రొక్కమున కాశించు నీవె— నీకానందకరమగునట్లు నటించు నీమె—యానందమన నేమో

గూడ యెఱుంగదు. కాని నీమనస్సింకను పరిపక్వమును జెంది యుండకపోవుటచే నామాట లిప్పుడు నీకు రుచింపవు. మరల నొకసారి నీకు ప్రబోధమును సరియైన మార్గమున గావించెదను. ఇంక సెలవు. (నిష్క్రమించును.)

సుం—(తనలో) ఈతడనినట్లు రొక్కముకై కపటప్రేమ నటించుచుంటినే గాని మరియొండు లేదు.

విన—సుందరీ ! కబీరునెట్లవమానపరచితినో జూచితివా ? ఇంతతో నీతనిని విడువను.

తారా—(కై పెక్కినట్లు నటించుచు) సుం-ద-రీ-ద-ద-ర్వ-కానీ-కళ్ళతో యింటాను.

విన—(నవ్వుచు) తారా ! స్వర్గం దగ్గర పడింది- హుషార్.

సుగు—కబీర్ వచ్చేడు. ఆనందంచచ్చింది. సుందరీ! తగులో.

తెరవ్రాలును.

---

# భక్తకబీర్

## తురీయాంకము.

---

కబీరుమందిరము.

[కబీరు, కమాల్‌దాసు, సుశీల.]

కమా—జనకా! ఎందఱెందఱో భక్తశిఖామణులు తామాహ్వానించి నట్లుగా నరుదెంచితిమని వచించుచున్నారు. ఇంకను ఎందఱెంద ఱో రాదలంచినట్లుగూడ దెలియవచ్చుచున్నది. నేను విష్ణుదా సుమందిరమునకు జేరునంతకు తమయాహ్వాన మాతనికందియుం డెను.

కబీర్—వత్సా! రాముఁడే వారినెల్లర నాహ్వానించియుండును. అట్టి భక్తులదర్శనమువలన మనముగూడ ధన్యులముగావలయుననియే యారాముఁడు దలంచియుండును.

కమా—వారికి దగినవసతులను మనము విచారించి కనుగొనవలయును గదా?

కబీర్—నాయనా! ఊరకయాతురపడియెదవేల? సర్వమును యా రాముఁడే విచారించుకొనును.

సుశీ—నాథా! అట్లని మన ముపేక్షించుట న్యాయమా?

కబీర్—తన్వీ! కుమారా! ఇదియంతయు నొక ధనసంపన్నునిపన్నా గము. ఆతఁడు నాకుఁ దీరనితలంపులు గలుగజేయవలయునని

యిట్లు సాధువులను భక్తాగ్రేసరులను యీవారణాశికి రావలసిన దని నే నాహ్వానించినట్లుగా నాహ్వానించియున్నాఁడు.

కమా—ఈవిషయమును మనము వెల్లడిచేయుట మంచిదని తలంతును.

కబీర్—కుమారా! వలదు. వలదు. ఆతఁడు భగవదనుగ్రహమును బడయనున్నాఁడు.

సుశీ—ఎట్లు?

కబీర్—మీ కావిషయములన్నియు త్వరలోననే దెలియగలవు. ఇప్పు డాతఁడు నన్ను పరిహాసింపఁదలంచి యిచ్చటికి రాగలఁడు.

[ప్రవేశము వినయశీలుఁడు తారాచరణుఁడు]

విన—మహాశయా! తమదర్శనమునకు రావలయుననియే వచ్చియుంటిని.

కబీర్—తమ రరుదెంచుటచే మాగృహము పవిత్రమైనది.

చ. సతతము వేశ్యభామినులు ౯ చక్కఁగపాడుచునాటలాడి నం
చితగతిమోదమున్ గలుగ ౯ జేయసుఖించుచునుండు మీర లీ
గతినరుదేర ధన్యతను ౯ గాంచితి, జన్మ తరింపనుండె స
ద్గతులు లభించు నిక్కముగ ౯ త్వాదృశభక్తుల జూడగల్గుటన్.

నన్ను చరితార్థుని గావింపవలయుననియే తమరిట్లు విచ్చేసియుండిరి. కూర్చుండుఁడు.

విన—(అపవారించి) ఇదేమి? యీతఁ డిట్లు వచించుచున్నాఁడు!

తారా—(అపవారించి) ఇదియే ముందరికాళ్ళకు బంధము వేయుటందురు.

విన—(తనలో) ఈతనిని బయటకుగొనిపోయి యెందఱుసాధువులీతని యాతిథ్యమునుగొనుటకు నిరీక్షించుచున్నారో జూపించెదను.

తారా—(అపవారించి) ఈతనిని వీధుల్లోనికిఁ గొనిపోవుట కుపాయ మాలోచింపుము.

కబీర్—తమరు కాశిచేవర్తమానమంపినను నేనే వచ్చియుందును గదా? మాకుటీరమున తమకు గూర్చుండుటకైన నాసనమీయజాలక పోతినిగదా ?

విన—ఆసనముల కేమిలెండు. తమ్ముబోలు భక్తాగ్రేసరుల సందర్శించుటే మహాద్భాగ్యమని యాసేతుశీతాచలమునుండియు నెందరెందరో భక్తులరుదెంచియుండ నీగ్రామమున వసించుమేము తమసన్నిధికి రాకుండనుండగలమా ?

కబీర్—ఎందరో భక్తులు నాసందర్శనార్థ మరుదెంచియుండిరా?

తారా—అవును మహాత్మా !

కబీర్—అట్లయిన నేను వారి కవశ్యమాతిథ్య మొసంగవలసియుండును. వా రెచ్చటవిడిసియుండిరో మీకుఁ దెలియునా ?

వినయ—ఆభక్తాగ్రేసరులసమూహమును దిలకించినంతనే మాచిత్తములు పరుగువారి తమచెంతకరుదెంచినవి. ఇంక మొండికట్టెలతో నచ్చట నుండజాలక యిట్లరుదెంచితిమి :

కబీర్—వారు నాకొరకు నిరీక్షించుచుందురేమో !మన మొకసారి వార ల సందర్శించివత్తము. కమాల్ ! నీవు, నేను మరలివచ్చునంత లో పూజాద్రవ్యముల సిద్ధపరపుము.

(కబీరు, వినయశీలుఁడు. తారాచరణుఁడు, ముందునకు పరిక్రమింతురు )

వెనుక తెర వ్రాలును.

కబీర్—మీరు మీమనంబులు పరువులిడనా చెంతకరుదెంచినట్లు వచించి నారు. మీకేగాదు. పెక్కురగుభక్తులను దిలకించినవారికి— యానిముషమున భక్తిభావ మంకురించుటయుగూడగలదు.

విన—(తారాచరణునితో) ఇదియంతయు మనపన్నుగడయని యెఱుం గడుగాబోలును.

తారా—కొలదినిముషములలోనంతయు తెల్లముకాఁగలదు.

తెరయెత్తబడును.

కబీర్—(వినయశీలునితో) వీరేనా భక్తులు. అదేమి. ఆమరుగున నున్న స్థలమున నారీతిని వంటచేయువారెవ్వరు? ఈభక్తులకు సమారాధనము గావించువారెవ్వరోగదా !

వినయ—(సంభ్రమాశ్చర్యములతో) ఇదెక్కడివిపరీతము. ఈవస్తుసంభారములెక్కడనుండివచ్చినవి. ఈపచనకృత్యమును నిర్వహించువారెవ్వరు—ఇంతమందికబీరులెక్కడినుండివచ్చియుండిరి. ఆహా! ఎట్టిసందర్శనము గాంచుచుంటిని! మహాత్మా! తామే యిన్ని రూపములను ధరించి యింతమందిభక్తులకు సంతృప్తినొసంగుచుంటిరా ?

(ముందునకు పరిక్రమింతురు.)

[ప్రవేశము:—కమాలు, సుశీల ]

సుశీల—కుమారా ! అట్లు విభ్రాంతివంది తిలకించుచుంటివేమి? మీజనకులెందున్నారోపరికింపుము.

కమాల్—జననీ !

సీ. ఒకవంక భక్తుల కుద్రేకమొదవంగ
పరతత్త్వమును బోధ పరచుచుండె
ఒకవంక యోగుల కొకడె దైవతమంచు
మించువేడుక వచియించుచుండె
ఒకవంక దనుజూడ నుత్సహించెడువారి
కెల్లను దర్శన మిచ్చుచుండె
ఒకవంక మాధుర్య మొల్కునట్లుగ రామ
భద్రునికీర్తనల్ బాడుచుండె

ఒక్కదిక్కునయతులకు నే యోగగమ్యు
డైన పురుషుండు సూర్యవంశాబ్ధిసోము
డనుచు బోధించు నొకదెసయందుభక్త
వర్యులకు నెల్ల భోజనవసతి దెలుపు.

నాటి శ్రీకృష్ణుని రాసక్రీడాభివర్ణన మాలించియుంటిమిగాని నేడు జనకుం డందఱకన్నిరూపులై వర్తించుచుండుట ప్రత్యక్షంబుగా దిలకింపగల్గితిమి. ఒక్కమానవునకు తలదాటినకార్యమియ్యది. పరికింపగా నియ్యది యా రామభద్రుని లీలయని తలంపవలయును.

కబీర్——(వినయశీలునితో) ఓయీ! విభ్రాంతుఁడవై నాడవేమి?

తారా——ఇదంతయు నింద్రజాలమువలెనున్నదే!

వినయ——(కబీరునిపాదములపై బడి) మహాశయా! మన్నింపవలయును. తమప్రభావమెట్టిదో తెలియనేరక యిట్టి యకార్యకరణమునకు పూనుకొంటిని.

కబీరు——నాయనా! నేను సర్వమెఱుంగుదును. నాడు సుందరితో నీవుండగా నరుదెంచి నీకు ప్రబోధముగావించుటకు మరలచనుదెంతు నని వచించియుంటినిగాదా? అయ్యది నేఁడు సమకూడినది. నాయనా! ఐశ్వర్యములు నిక్కములుగావు. నిత్యమైనట్టిదియు, సత్యమైనట్టిదియు, నాశనరహితమైనట్టిదియు, మాలిన్యరహితమైనట్టిదియునగు యానందమును బడయుటకు యత్నింపుము. అట్టియానందమే మోక్షము. అద్దానిని సాధించుటయే పరమావధిగా దలంపుము. అట్టియపవర్గమును సాధింపదగుమార్గము లన్నిటియందునను రామనామసంకీర్తనమే యుత్తమమైనదని యెఱుంగుము. రామనామమాహాత్మ్యమిట్టిదని వక్కాణించుట కాదిశేషుఁడైన నశక్తుడగుననుటలో నతిశయోక్తియుండబోదు.

సీ. బ్రహ్మహత్యాదులౌ ఽ పాపాటవులగాల్ప
తారకమంత్రంబు ఽ దగినయగ్ని
సంచితప్రారబ్ధ ఽ సంచయంబులబాప
తారకరాజమే ఽ దగినమాత్ర
మపవర్గసౌఖ్యంబు ఽ లరచేతజూపింప
తారకరాజమే ఽ దగినహితుఁడు
కడలేనియానంద ఽ కడలిదేలింపఁగఁ
దారకరాజమే ఽ దగిననావ
భద్రగుణుఁడైన శ్రీరామ ఽ భద్రునామ
సంస్మరణమాచరించిన ఽ సంభవించు
పదవి యిట్టిదటంచు నా ఽ బ్రహ్మయైన
పలుకజాలడటంచును ఽ దలపుమయ్య.

లెమ్ము నాయుపదేశమును బడసి రాము నుపాసింపుము. జన్మజన్మంబుల నొనరించియున్న పాపంబులు పటాపంచలగును

విన—అనుగ్రహింపబడినాడను

కబీ—ఓయీ! ఇంకను యిక్కడ నిలుచుటెందులకు నాతో మాకుటీరంబున కరుదెంచి నే నొనర్చు శ్రీరామపూజనముఁగని పాల్గొనుము.

విన—చిత్తము.

పరిక్రమింతురు. తెరవ్రాలును.

---

## ద్వితీయరంగము.

ఒకవీధి.

[రహీము. రజాక్ అను యిరువురు తురకలు చెరియొకవైపునుండియు ప్రవేశింతురు.]

రహీ—రజాక్ సలాంభాయీ !

రజా—సలాం. సలాం. ఏమ్టి ఎక్కడా దర్షనం లేకుండావుండావే ! పనీపాటా యెక్వ అయింది తలుస్తాం.

రహీ—పనీ నహీ పాటా నహీ ! మాకీ రాత్రిపూటా కంటికీ నిద్ద రేకుండా చెయ్యవాలా అని రోజూరోజూ యింటిప్రక్కా రామ్ రామ్ అని కబీర్ గోలపెడ్తాడు. వద్దూ అంటే పెద్దపులిలా మీాదిక్కి వస్తాడు.

రజా—కబీర్కి తురకబిడ్డా- రాముడ్కి. తలుస్తాడు. వీడ్కిసంగతీ కొంచెం ఖాదర్ చెయ్యలేక పోయినావ్. రోజూరోజూ నిద్దర్ గయాహైం తే నీదిపానంవాడు పరాకి అవుతాడు. గోలపెట్టి గొంతుక్కి పిసికియేస్తానంటే ఊరుకుంటాడూ. లేకపోతే—

రహీ—లేకపోతే ఆఘుర్మే యిడిసిపెట్టి దూర్ కి చల్గయా చెప్పాలా.

రజా—అంతఖర్మం నీకీ యేంవచ్చింది. వాడ్కి చల్గయా చెప్పూ కదల్కాపోతే.

రహీ—అరేహల్లా ! ఆడు కదల్ మంటే నహీసెప్తాడు. కోపంచేస్తే యింకాయెక్వా గోలపెడ్తానంటాడు.

రజా—నాకీ ఒక్టి హుపాయం తోస్తుందిబాయీ ! వాడ్కిసుర్గయా చెప్తే సుఖం

రహీ—హల్లా ! హల్లా !! నాకీ దగర్కి యెల్లడాన్కి గుండెల్గుబుల్ గుబుల్ మంటాదీ. ఒక్టిదఫా ఖాజీగార్నీ బడాబడా ప్రశ్నల్ యేసీ సవాల్గొట్టి- చల్ గయాసెప్పేటప్డూ దగ్గ్రావున్నా నాకీ

సాడల్ పుట్టింది. హింకా ఆడిమాట యిప్పడేసర్కి మాదీకాళ్లు గడ్డడా వణికి పోతాయి.

రజా—ఛూ! ఛూ!! హమారీతుర్కబిడ్డా నీకీ తుర్కబిడ్డా యింతపిర్కి కండామనిసిహైతే - కాఫర్లు మన్కి ఖాతర్ నహిసేస్తారు.

రహీ—నాకీ సహాయం కొంచెం సేస్తావూ భాయీ!

రజా—హమ్కు తయారీ.

[ప్రవేశము కబీరు.]

కబీ—తుంకైకూ తయార్ హై!

రహీ—(తనలో). హల్లా! హల్లా!! మాదీపుద్దేసం వీడ్కి తెల్సివుంటే నాకు మర్గయాసెస్తాడ్.

కబీ—కైకూ తయార్ హై! నాయనా! ఎందులకునీవు సిద్ధముగానుంటివి.

రజా—హెందుకోసంతయార్ వున్నా నీకే హెంద్కు చెప్పావల్సి వుంది.

కబీ— నీయభిప్రాయము నెఱింగియుంటిని. రహీమ్! నీవుగతమున గావించిన యేకొలదిపుణ్యవశముననో రామనామసంకీర్తన మాలింపగలిగితివి, కాని సంపూర్ణ ఫలితము నందజాలకుంటివి. నోరారరామునికీర్తించుచు సద్గతినందుము.

రజా—తురకాకిపుట్టీ. రామ్ రామ్ అంటూ కాఫర్ గేస్తూ తలుస్తావ్. మసీద్కి నయ్ ఆయా! హల్లాకి నమాజ్ నహికరుంగాచెస్తావ్ నీకీ జులుం చేసి, మతంనిల్పుకోవాలా తోస్తుంది.

కబీ—ఓయీ! నేను మశీదునకు రానంతమాత్రమున దైవప్రార్థనసలుపుచుండుట లేదని తలంచితివా? మశీదులోననే దైవమున్నాడా. సర్వవ్యాపియగు భగవంతుఁడు మశీదులోనుండి వేరొకచోటలేకుండునా? ఎంతవెఱ్రిపడుచుంటివి! నేను దైవప్రార్థనముచేయుటలేదా?

రజా—కాఫర్కి దేవుణ్ణి తలుస్తావేం.

కబీ—ఒక్కొక్కని కొక్కదేవుడు గలడా?

సీ. తనలీలచే విశ్వ ◊ మును సృజియించుచు
నఖిల జీవులను తా ◊ నరసికొనుచు
తనయిచ్ఛవచ్చిన ◊ దగుమార్గమున వాని
నాడించి సమ్మోద ◊ మందియుండి
అంత్యకాలంబున ◊ నఖిలంబు తనలోనె
లీనమౌనట్లు క ◊ ల్పించుకొనుచు
కర్తయు భర్తయు ◊ హర్తయు దానయ్యు
విశ్వంబునంటక ◊ వెలయుచుండు
నాపరంధాముఁ డొక్కడే ◊ యగునుగాని
నీకు నొకదైవతంబును ◊ నాకు నొకడు
గలుగ బోడంచుమది నెఱుం ◊ గంగలేక
వాదులాడిన యంత నర్థ్ఫలము గలదె

నాయనా ! మనుజున కొక్కొకదైవముండునా ? సర్వజగంబులకును ! నాధారుండగువాఁడు ఒక్కడేయనుట మదిదలంపుము. ఆతడే నీకు నాకును సమస్తలోకములకును పరాత్పరుఁడు. ఆతని యిచ్ఛాలీలనే మన మెల్లరమును సంచరించుచున్నాము. అట్టియెడ నేను హిందూదైవమును ప్రార్థించుచుంటినను మత్సరమేల కలుగవలయును. ఊరక మత భేదములను కల్పించుకొని మూఢులమై నే నారాధించుదైవమే యధి కుఁడని వాదించుచు కలహమునకు కాలుదువ్వుచుందుము.

రహీ—(తనలో) కబీర్కి పత్యం బోలేగా.

రజా—కాఫర్కి దేముడు నాకీ దేవుడూనెప్తే నీకి నాల్కాకోసీయేస్తా. మాదీ తడాఖా సూడు.

కబీ—నీ కంతటి మతద్వేష మెందులకు. మహమ్మదీయులకు, హిందువు లకు, క్రైస్తవులకు, యిట్లు వక్కాణింపనేల సమస్తజాతులవారి

కిని, సర్వవర్ణములవారికిని దైవమొక్కఁడే యని నొక్కివక్కా
ణింపనగును. కాదని నీవు మూర్ఖునివలె వాదించినంత ప్రయోజ
నము సుంతయును గలుగదు! రాముని భజింపుము.

రహీ—(తనలో) రజాక్ అగ్గిలా మండిపోతూవుండాడ్. అరే! అరే!
యీాడు కబీర్కి జులుం సెయ్యఁడాన్కి కత్తీతీస్తూవున్నాడ్.

రజా—(మొలలోని చాకును పైకిదీసి) నీకీ హూాక్కబాకూపోటూ
యిస్తే రాముడు గీముడు గయాసెస్తావ్.

కబీ—కానిమ్ము! సంకోచింపకుము. నీదైవమును స్మరించుకొనుచు
నిస్సంకోచకముగా నన్ను పొడువుము. (రజాక్ ముందునకడుగు
వేయబోవును కాని కదలలేదు. కబీరువంక తీక్ష్ణముగా జూచును.
కబీరు అల్లారూపమున గాన్పించును.)

రజా—(కబీరుపాదములపై వ్రాలి) హల్లా! హల్లా! కటాక్షంవుంచి యీా
డ్కి పానం నిల్పావాలా కోరతామ్.

కబీ—ఇప్పుడైనను నీకును నాకును దైవమొక్కఁడే యనుట కంగీక
రింతువా ?

రజా—ఒప్పుకుంటాం వొప్పుకుంటాం. తమదీ కటాక్షంసేతా దేముడు
ఒక్డుఅని బాగా తెల్సుకున్నాం. మీాదిపాదాలు గొలుస్తాం. మాకీ
మంచిమంచి యిషయం బోధసెయ్యాల్సిందని నాదీప్రార్థన.

కబీ—దైవము నారాధింపుము. ఇంతకంటె నుపదేశింపవలసినదేమియును
లేదు. నీవు యెంతగా సుఖింపవలయునని యభిలషింతువో యం
తగా పరులను సుఖపెట్టవలయుననుట మరువకుము. లోకము
నీకెట్లుపకరింపవలయునని తలంతువో యట్లే లోకమున కుపక
రించుటకై యత్నింపుము. నిరంతరమును పరంధాముఁడగు దైవ
ము నారాధింపుము. భగవంతుఁడు తన్ననపరతముపాసించునా
రలకు వశ్యుడై యుండును. మరియు దన్నే నామరూపముల

భక్తుఁ డారాధించుచుండునో యానామరూపములతోడ నేసాక్షా
త్కరించుననుమాట మరువకుము. మతవైషమ్యముల మంటగ
లుపుటకై యనవరతము యత్నించుచుండుము.

రహీ—నన్ను కటాక్షంతోటీ చూడావలా యేదుకుంటాం.

కబీ—రహీమ్! రాముని కటాక్షమును గోరుకొనుము. రామభజనయందు
పాల్గొనుచున్న యెడల నాతని కటాక్షము సులభముగా బడయ
గల్గుదువు. అపుడు నీ కెట్టికొఱుతయు గలుగకుండును. రమ్ము.
శ్రీరామభజనము గావించుకొనుచు పూజామందిరమున కరు
గుదము.

(అందఱును నిష్క్రమింతురు.)

---

తృతీయరంగము.

ఒక వీధి.

[నారాయణశాస్త్రి, చయనులు అనుయిరువురు బ్రాహ్మణులు చెరియొ
కవైపునుండియు ప్రవేశింతురు.]

చయ—ఎవరు నాయనా! నువ్వు. పెద్దవాడను గుర్తు తెలియడంలేదు.

నారా—నేను నారాయణశాస్త్రిని.

చయ—నువ్వా! ఎంతవాడవైతివి. అయితే స్వాధ్యాయం పూర్తిచేసి
నతర్వాత ఎక్కడా కనపడకుండాపోయేవు. గ్రామంలో లేవా
యేమిటి?

నారా—లేను. నెల్లాళ్లయిందివచ్చి.

చయ—ఇప్పుడు మకాం యిక్కడేనా ?

నారా—అన్నమాటే.

చయ—ఇంకా చదువుకుందామనేనా ?

నారా—అవును. తాతగారూ! తర్కశాస్త్రం రామానందుల వారిదగ్గర చదువవలెనని వచ్చి మొదలుపెట్టినాను కాని—

చయ—కాని యనుచుంటివేమి, తర్కంలో వారిని మించినవారున్నారా నాయనా ?

నారా—వారు గొప్పవారు కారని కాదు. మధ్యను చదువున కాటంకము వచ్చినది.

చయ—ఏం. ఆయన గ్రామాంతర మరిగియుండిరా ?

నారా—లేదు లేదు. కాని మీ కీవిషయ మేమీ తెలియదా ?

చయ—ఏవిషయం నాయనా ? బొత్తిగా శక్తి లేకపోవడంచేత యెక్కడకీ పదచలనం చెయ్యడం లేదు. ఏదో కృష్ణా రామా అనుకుంటూ యింటిదగ్గరే కూర్చోడం. వేళకింత భోజనం చెయ్యడంతప్ప కదలడానికేనా ఓపిక లేదు. ఇంతకీ ఎవళ్లేనా వస్తారాఅంటే యిల్లు దూరంగా విసిరిపారేసినట్లుందిగదా ?

నారా—అవును.

చయ—ఏదోకారణంచేత చదువు కడ్డువచ్చిందన్నావే?

నారా—అవునండీ !

చయ—అదేమిటి నాయనా ?

నారా—ఏమున్నదండీ ! ఈవరకు మనమంతా రామానందులవారు మహాఘుటికులనియు, జ్ఞానసంపన్నులనియు, తపోధనులనియు అనుకునేవారము.

చయ—అలాగనుకున్నావా యేమిటి? ఆయనతో సమానపాండిత్యంగలవారెక్కడేనా వున్నారనుకున్నావా యేమిటి?

నారా—నేననుకోవడం కాదు. సరిగాజరిగిన వాస్తవంచెపుతున్నాను సావధానంగా వినండి. ఆరామానందులవారికంటె గొప్పవారొకరు యీకాశీపట్టణానికి వచ్చేరు.

చయ—వారికంటే గొప్పవా రున్నాడనడం సత్యమేనా ?

నారా—సత్యమో అసత్యమో ! కడవరకూ వింటే మీకే తెలుస్తుంది. వినండి. వారిపేరు ఘోరక్‌నాథులట, మత్స్యేంద్రుని శిష్యులలో నగ్రగణ్యులట, వారు వారణాసి కరుదెంచి రామానందులవారి ప్రజ్ఞావిశేషములనుగూర్చి విని యీర్ష్యవహించి వానినెట్లైన వాద ప్రతివాదముల నోడింప సంకల్పించుకొనియెను.

చయ—ఎంతగా సాహసించేడు ! ఏమంతప్రజ్ఞాశాలియని యీమోస్తరుగా కయ్యానికి కాలుదువ్వుతున్నాడు ?

నారా—నవనాథసిద్ధులలో నమితప్రజ్ఞానిధియని వాడుక.

చయ—అయితేమాత్రం రామానందులవారిముందు నిలువగలడా ?

నారా—రామానందులవారే వెనుకంజ వేసినారు.

చయ—ఏమిటీ ? సంగతి సందర్భాలన్నీ చెప్పు నాయనా! వింటాను.

నారా—ఘోరక్‌నాథుఁడు రామానందులవారి మఠముననెదుట నొక త్రిశూలమును పాతి యద్దానిపై నొకవ్యాఘ్రచర్మమును పరచి యద్దానిపై గూర్చుండి రామానందులవారిని వాదమునకు రావలసినదని పిలచెను.

చయ—రామానందుల వారేమనిరి.

నారా—తొలుత రామానందులవారి కీవృత్తాంతము తెలియదు. అప్పుడుశిష్యులు కొందరు ఘోరక్‌నాథుని పరిహసించి, ఓరీ ! నీవొక యింద్రజాలికుఁడవు, రామానందులవారితో వాద ప్రతివాదములు సల్పుట కనర్హుడవని గేలిచేసిరి.

చయ—అది మనవారి తెలివితక్కువను సూచించుచున్నది. తరువాత జరిగినవిశేష మేమిటో చెప్పు నాయనా ?

నారా—ఘోరక్‌నాథుఁ డట్టహాసముచేయుచు హుంకరింపగా రామానందులశిష్యులెల్లరును వెఱగుపడి పరతెంచి గురువుగారి కీవృత్తాంతమంతయును విన్నవించిరి.

చయ—అపుడు రామానందులవారు స్వయముగా వాగ్వాదమునకు ప్రారంభించిరని తలంతును.

నారా—లేక లేదు. వారు నవనాథసిద్ధుల ప్రజ్ఞాదికము లెఱింగినవార గుటచే వాదమునకు ప్రారంభింపకుండిరి. అంతేగాక ఘోరక్ నాథునిబారి బడకుండ దన్ను రక్షింపవలసినదని శిష్యులనడిగిరి. శిష్యులెల్లరును నుపాయాంతర మేమియును లేనందున నొకరి మోమొకరు జూచుకొనుచు నెవరికిదోచినమార్గమునవారు పరు వులిడిరి.

చయ—బాగుబాగు, నీవు చెప్పునదెల్ల నొకకథగా దోచుచున్నది. ఇదె క్కడిచిత్రము.

నారా—ముందుసంగతు లింకను చిత్రముగా నుండును.

చయ—ఇంతకన్నా చిత్రముంటుందా నాయనా ?

నారా—ఉన్నది వినండి. రామానందులవారు మఠములోనే కూర్చుండి యేమిచేయుటకును దోపక యాలోచించుచుంటిరి.

చయ—రామానందులవా రిట్టివానితో వాదముసల్పుట మంచిది గాదని తలంచి యూరకుండిరని నే ననుకొనుచున్నాను.

నారా—మీయిష్టమువచ్చిన ట్లనుకొనుడు. మనమందరమును వెవ్వ రిని రామానందులశిష్యుడవు గావని నిరాకరించి తృణీకరించితి మో యాకబీరు యీవృత్తాంతమంతయును విని బట్టలునేసికొ నుచు చేతిలోనున్న నూలుకండెనుగూడ నేలపై బడవేయకుం డగనే రామానందులవారిమఠముచెంతకు పరువిడెను.

చయ—అయ్యో ! మఠమంతయు నపవిత్రము గాలేదుగదా ?

నారా—అనుదినమునను యీతడు రామానందులవారిని దర్శించుట కు వచ్చుటయు, మనవా రాతనిని లోనికి రానీయక వెడలగొట్టు చుండుటయు మీకు విదితమేకదా ? నాడు శిష్యులెవ్వరు లేక

పోవుటచే నాతఁడు మఠములోనికరిగి రామానందులవారికి సాష్టాంగనమస్కారము గావించెను.

చయ—హిందువులమఠమున మహమ్మదీయులు ప్రవేశించిరా ?

నారా—కబీరు రామానందులవారి కిట్లనియెను. మహాత్మా ! ఘోరక్‌నాథునితో వాదమునకు నన్ను బంపుఁడు. ఆతని నోడించి తమకు గురుకట్న మొసంగెదనని ప్రార్థించెను.

చయ—వీని కెంతసాహసమున్నది. రామానందులవా రేమనిరి?

నారా—అనుట కేమున్నది వలదనిబోధించిరి, ఆవాదమున నపజయము చేకూరిన వారణాసికి ముప్పురాగలదని సూచించిరి. కాని కబీరు వినడయ్యెను. ఆతఁడు నాకంఠమున జీవుడుండగా నా గురువర్యు నవమానపరుపనెంచినవానిని క్షమింపనోపనని పల్కుచు ఘోరక్‌నాథునితో వాదమునకు దలపడెను.

చయ—ఇయ్యది నిక్కముగా నాతనితలకు మించినకార్యమే యగును

నారా—కావచ్చుననియే తలంతును. కాని ముందుజరిగినసంగతుల నాలింపుఁడు. అట్లు వాదమునకు సిద్ధపడినకబీరునుజూచి, ఓయీ ! నాతో వాదింపగల సామర్థ్యమున్న నావలె గూర్చుండుమనియెను. అంతట కబీరు తనచేతనున్న నూలుకండెకొనను భూమిపై కాలిబొటనవ్రేలితో నొక్కి కండెను చేతితో నెగమీటెను అటుపిమ్మట కబీరుతనగురువర్యులగు రామానందుని స్మరించుచు నాదారము నాధారముగా గొని పైకెగప్రాకి యాకండెపై గూర్చుండెను.

చయ—చాలచిత్రముగా నున్నదే ?

నారా—అట్లుగూర్చుండి వాదము సలుప దనయొద్దకు రావలసినదని ఘోరకుని బిలిచెను.

చయ—ఘోరకుడు సిగ్గుపడి యూరకుండెనని తలంతును.

నారా—ఘోరకనాధు డించుక వెనుకకు తగ్గెను కాని వా రిరువురకును గొంతతడవు వాదప్రతివాదములు జరిగినవి.

చయ—ఇంతకును జయించిన దెవ్వరు ?

నారా—కబీరుమహాశయుఁడే జయించెనని చెప్పవలయును.

చయ—ఘోరకుఁ డోడితినని యంగీకరించెనా ?

నారా—అంగీకరించుటయే గాదు. రామానందులవారిని శరణుజొచ్చి తనకు దెలియనియంశములనెక్కింటిని నేర్చుకొని వెడలిపోయెను. ఆకారణమున నాలుగైదుదినములనుండి పాఠము జరుగలేదు.

చయ—కబీరు మహిమాన్వితుడనుట నిర్వివాదాంశము.

నారా—ఆమహిమ తారకమంత్రమునందే గలదు. తారకమంత్రోపాసకు డగుటచేతనే ఘోరకుని సులభముగా నోడింపగల్గినాడు. తాతగారూ! ఇంక సెలవిండు.

చయ—నాయనా! పోయిరమ్ము. కాని ఒక్కమాటు నన్నా కబీరుచెంతకు గొనిపొమ్ము. ఆమహాత్ముని దర్శింపవలయునని యున్నది.

నారా—మి మ్మిప్పటికిని గొనిపో నగత్యము లేదు. ఆతడదే యావీధియందు హిందూమహమ్మదీయసమ్మేళనమునకై భక్తిమార్గమునుబోధించుచున్నాడు. త్వరగా నేగిన మీ రాతని యుపన్యాసమును గూడ వినగలరు.

చయ—మంచిది. పోయి అతని నొకసారిచూచెదను.

(నిష్క్రమించును)

నారా—ఇంక గురువుగారిచెంతకేగినను నేడు పాఠము జరుగుట కవకాశముండదు. నేనుగూడ నాకబీరుమహాశయునియుపన్యాస మాలించెదగాక. (నిష్క్రమించును)

# భక్తకబీర్

## పంచమాంకము.

---

### ప్రథమరంగము.

ఒకమఠము.

[ప్రవేశము:- జ్ఞానదేవులు, నామదేవులు.]

జ్ఞాన—నామదేవా ? ఈవారణాశీక్షేత్రమున కరుదెంచి యించుమించుగ నారుమాసములు గావచ్చినది. మరియు గార్తీకమాసము సమీపించుచున్నది. మనము తిరుగ పండరిపురమునకు బోవలదా ?

నామ—అనుజా ! అవును. పండరీనాథుని సేవింపవలయు ననుకోరికయూ మనంబున రేకెత్తుచున్నది. కాని—

జ్ఞాన—కాని యని యూరకుంటి రేల.

నామ—ఈక్షేత్రమున గావింపవలసినకార్యములలో నొక్కటిమాత్రమే శేషించియున్నది. అయ్యది నెరవేర్చినపిమ్మట పండరి కేగుదము.

జ్ఞాన—ఇచ్చట గావింపవలసిన కార్యమొక్కటి గలదా ! స్ఫురించినది. కబీరుదాసునకు దర్శనమొసంగి యాతనినిగూడ పండరిక్షేత్రమునకు రావలసినదని యాహ్వానింపవలసియున్నదిగదా ?

నామ—అవును. నేడే యాతనిని దర్శింతము లెమ్ము.

జ్ఞాన—మంచిది.

(ఇరువురును లేచి పరిక్రమింతురు.)

తెరయెత్తబడును.

---

ద్వితీయరంగము.

కబీరుదాసు మందిరము.

[కబీరు ధ్యానమున మునింగియుండును, కమాల్ దాసును సుశీలయు మరికొందరుభక్తులును భజనసేయుచుందురు.]

జ్ఞాన—పరమభాగవతోత్తముఁడైన నీతనిగర్భమున నాతనికంటె భక్తిప్రపత్తులుగల కుమారుఁడుదయించినాఁడు.

నామ—కొదమసింగమునకు గ్రామసింహము జనించునా?

కమాల్—(జ్ఞానదేవ నామదేవులకు నమస్కరించి) పరమభాగవతాగ్రేసరులకు కమాల్ అభివాదన మొనర్చుచున్నాడు.

నామ—(ఆశీర్వదించి) వత్సా! భక్తాగ్రేసరుఁడ వయ్యెదవుగాక.

సుశీ—(నమస్కరించును.)

నామ—సౌభాగ్యవతీభవ.

కమాల్—వైష్ణవశిఖామణులగు తమపాదరజము సోకుటచే మాగృహంబెంతయు ధన్యత గాంచినది.

జ్ఞాన—కమాల్ దాసూ! మీతండ్రికబీరును సందర్శింపవలయునని యరుదెంచియుంటిమి. ఆతఁడు ధ్యాననిమగ్నుఁడై యున్నాఁడు. కావున కొంతవర కిచ్చటనే నిరీక్షించుచుందుము.

కమాల్—నిరీక్షించుటమాత్రమే యొనర్చి మాకు దేవరకు నాతిథ్యమర్పింపగలభాగ్యమును కొదువసేయవలదని ప్రార్థించుచుంటిని.

(ఇంతలో కబీరు ధ్యానసమాధినుండి మేలుకొని యెదుటనుండు జ్ఞాన
దేవ నామదేవులను గాంచును.)

కబీ—పరువుపరువున బోయి ముందుగా నామదేవునకును, పిమ్మట
జ్ఞానదేవునకును నమస్కరించును.

సీ. చాంగదేవులురాగ ॥ చలువరాతిన్నెను
నడిపించె నెవ్వాడు ॥ నయముతోడ (జ్ఞానదేవులు)
తురకజేనికిబుద్ధి ॥ గదుపంగ ధేనువున్
బ్రతికించె నెవ్వాడు ॥ ప్రతిభతోడ (నామదేవులు)
వింతవాదములాడ ॥ వేదముల్ పశువుచే
జెప్పించె నెవ్వాడు ॥ యొప్పులొలుక (జ్ఞానదేవులు)
సాధురక్షకు నాగ॥నాథునభిముఖుని
గావించె నెవ్వాడ॥ఖండభక్తి (నామదేవులు)

గీ. దప్పిబాయమార్వాడి ప్రాం ॥ తంబునందు
గలుగజేసెనెవ్వాడు గం ॥ గాప్రవాహ (నామదేవులు)
మట్టి మహిమాఢ్యులైన భ॥క్తాగ్రగణ్యు
దర్శనముగల్గె జన్మంబు ॥ ధన్యమయ్యె.

మహాత్మా! కబీరునామాభిధానుఁడ నగు నేను తమకు సాష్టాంగనమ
స్కార మాచరించుచున్నాఁడ ననుగ్రహింపుడు.

నామ—కబీర్! నీయట్టి రామభక్తాగ్రగణ్యుఁ డీయిలాతలంబున నెందు
ను యుండడని వచింపనచ్చును

జ్ఞాన—నిన్ను దర్శింపవలయుననియే మేము పాండురంగనిసన్నిధినుండి
యీవారణాశీపురంబున కరుదెంచియుంటిమి. నిన్నును, నీకంటెను
భక్తాగ్రేసరుఁడైవ నీకుమారునిగూడ సందర్శించియుంటిమి.

నామ—సూర్యకులాబ్ధిసోముఁడు ని న్ననవరతము రక్షించుచు నీకెట్టికొ
దువయు గలుగకుండునట్లు గావించుచుండుటచే సుఖంబున నీవా

రణాశియందు గూర్చుంటివి. కాని భక్తాగ్రగణ్యులు పెక్కురు నీ సందర్శనాపేక్షతో నుండియు, నయ్యది నభఃపుష్పముగా బావించి వెతనొందుచున్నారు. కావున—

కబీరు—కర్తవ్యమును బోధింపుఁడు.

జ్ఞాన—నిన్ను దనసన్నిధికి గొనిరావలసినదని పండరీనాథుఁడు వచించి యున్నాఁడు.

నామ—నిన్ను పండరికాహ్వానింప దలంచియే యిట్లరుదెంచి యుంటిమి.

కబీరు—అవశ్యము. తమతోడనే యరుదెంచెదను. ఇంతకంటెను వాంఛ నీయ ముండునా? పాండురంగఁడే రావలసినదని యాజ్ఞాపించి యుండగా నన్యథా వచింతునా? ఆహా! నాకు పండరీనాథుని సందర్శించి యానందింపగల భాగ్యముగూడ సంప్రాప్తించు చున్నదిగదా.

గీ. పుండరీకుని వాత్సల్య ॥ మూనిబ్రోవ
నిటుకరాశిపై దర్శన ॥ మిచ్చినట్టి
రంగనాథుని గననంత ॥ రంగమునను
అపుడె తత్తరముజనించె ॥ నద్భుతముగ.

నామ—కబీర్ మహాశయా! తత్తరబడకుము. మే మింకను గొన్ని పుణ్య క్షేత్రముల సందర్శించి కార్తీకమాసమునగాని పండరిపురమునకు జేరబోము. మాకు మరల నీసందర్శనలాభము చేకూరునట్లుగా నీవును యామాసారంభమునకు పండరికి రావలయునని గోరు చుంటిమి.

కబీ—తమయాజ్ఞ కన్యథా వర్తింతునా?

నామ—ఇంక మాకు సెలవిమ్ము పోయివచ్చెదము.

కబీ—నాయొసంగు నాతిథ్యమును స్వీకరింపకయే వెడలిపోయెదమనుట భావ్యమా? మీరాకచే సాక్షాత్పండరినాథుడే నాగృహమున

కరుదెంచినట్లుగా దలంచి యధికంబుగ సంతసించుచున్న నన్ను చిన్నబుచ్చి యింతలో నరుగదలంచుట న్యాయమా!

నామ—మంచిది. నీయభీష్టమును దీర్చియే మేము మరముగ కరుగ గలము. మేము విశ్వనాధుని సందర్శనమున కరుగుచుంటిమి. మరల నీమార్గముననే యరుదెంచి నీయొసంగు నాతిథ్యమును గ్రహింతుము.

కబీ—అనుగ్రహింపబడినాడను.

(జ్ఞానదేవ, నామదేవులు నిష్క్రమింతురు.)

సుశీ—నాధా! ఇంట నొక్కపదార్థమైనను లేదే. వీరికెట్లు నాతిథ్యమీయఁగునని తలంచితిరి. ఒక్కపూట గడచుటకే మిగులకష్టముగా నున్న మనము అతిథులకు నాతిథ్య మెట్లీయగలుగుదుము.

కబీ—రాముని కటాక్షమున్న నెట్టికొదువయు గలుగదు. లోనికేగి పరికింపుము. వలయుపదార్థము లింటనే లభింపగలవు.

సుశీ—లోనికేగి పరికింపవలసిన దేమున్నది. శూన్యభాండములునా?

కబీ—అటులనా? నేడు నీవే పరికరములన్నిటిని సమకూర్చుకొని యతిథిపూజనము గావింపవలయును. ఇంటలేకున్న నిరుగుపొరుగున నెచ్చటనైన నప్పుగొనిరమ్ము. అతిథిపూజనమున కెట్టిలోటును గలుగరా దనుమాట మరువకుము. ఎట్లో పదార్థములను సేకరించుకొని రమ్ము. నేను రాముని సేవింపబోవలయును.

(నిష్క్రమించును.)

సుశీ—ఇదెక్కడి ప్రారబ్ధము. ఏమిచేయుదును. నాడు వేనవేలుగ భక్తులరుదెంచినప్పుడు వారికెల్లరకును షడ్రసోపేతముగా భోజనాదికముల నొసంగి యాదరించినవల్లభుఁడు యిట్లానతిచ్చుటలో నేదో విశేషముండి యుండును. భర్తయానతి నెవ్వరినైన నడిగి జూచెదగాక. (నిష్క్రమించును.)

కమా—అతిథిపూజనమునకై వలయుపూజాద్రవ్యములను సేకరించి సర్వమును సిద్ధముగా నుంచెదను. నామదేవుల కాతిథ్యమొసంగగల్గినయెడ నిక్కువముగా నాపండరినాథుని కాతిథ్యమొసంగినట్లే యగును. కాన నేనును తత్ప్రయత్నమున నుండెదగాక.

(నిష్క్రమించును.)

---

## ద్వితీయరంగము.

### ఒకవర్తకుని మందిరము.

(దుకాణముపై వర్తకుఁడు గూర్చుండియుండును సుశీల వస్తువులను అప్పుగా గొనుటకై వచ్చి నిలువబడియుండును. తెరయెత్తబడును.)

సుశీ—అయ్యా! నేడు మాయింటి కతిథులు వచ్చియున్నారు వారల కాతిథ్య మొసంగవలసియున్నది గావున నాయందు కనికరముంచి యీజాబితాయందుగల వస్తువుల నిప్పింపుము.

వర్త—వీనికి సుమారుగా నైదారురూప్యములు గావలసియుండును.

సుశీ—అయ్యా! ఇపుడు నాచెంత ద్రవ్యము లేదు.

వర్త—ద్రవ్యమొసంగకున్న వస్తువుల నెట్లుగొనిపోవలయునని సంకల్పించుకొని యరుదెంచియుంటివి.

సుశీ—ఈద్రవ్యమును అప్పుగా భావించుము. నీఋణమును నాలుగైదు దినములలో దీర్చివైచెదము.

వర్త—ఐదారురూప్యముల నప్పుగా నొసంగుటయేనా? కరవుకాలము వచ్చి కూచున్నది. కన్నొడుచుకున్నా కానిబేరము కావచ్చుట లేదు. ఇల్లాంటప్పుడు అరువిస్తే మాఆబోరు దక్కుతుందా? నావల్లగాదు. అంత్యనిష్ఠూరముకన్న నాదినిష్ఠూరము మేలుగదా?

సుశీ—అయ్యా! నీఋణ మెంతకాలమో నిలువయుంచను. నేడేమో తురకల పండుగయగుటచే నంగళ్లన్నియును మూసియుండిరి. ఎరిగినవారి నెవ్వరినైన నడుగుటకు వీలు లేకుండబోయినది.

వర్త—అందుకు నే నేమిచేయుదును. అరువుసరువులిచ్చి అరికాళ్లరిగే దాకా తిరిగి చావలేను.

సుశీ—అయ్యా! నిన్ను వేడుకొందును. నీసొమ్మును పువ్వులలో బెట్టికొనివచ్చి యర్పించెదను. అతిథిపూజనమును సాగింపకున్నయెడల రౌరవాదినరకముల గూలవలసివచ్చునని యింతగా ప్రాధేయపడుచున్నాను.

వర్త—(తనలో) ఈమెను జూచినప్పటినుండియు మనస్సేమోగాపరుగు వారుచున్నది. అవసరమెక్కువగా గలదియగుటచే నడిగిన సమ్మతించునని తోచుచున్నది.

సుశీ—అయ్యా! ఇచ్చట గూర్చుండి జాలముచేయుటకు వ్యవధిలేదు. కరుణించి యావస్తువుల నొసంగి పంపుము.

వర్త—(మాటలాడక యామెవంక నెగాదిగ దిలకించుచుండును)

సుశీ—అయ్యా! నామనవి వినరా?

వర్త—తన్వీమణీ! నీమనవి నేను వినియెదను. నీ కావస్తువులన్నిటిని యూరక యర్పించెదను కాని నామనవినిగూడ నీ వాలించుట కంగీకరింతువా?

సుశీ—(తనలో) ఇదేమి యీతఁడిట్లు పలుకుచున్నాడు. ఈతని యభిప్రాయ మేమైయుండును. (ప్రకాశముగా) అయ్యా! అతిథిపూజన మవశ్యకర్తవ్యమై యున్నది. నీమనవి వినుట కెట్టియభ్యంతరమును వచింపను-కావున నీవాంచితమేమో యెఱింగింపుము.

వర్త—(సంకోచించి) నేను నోరుజారి వచించిన పిమ్మట నీవు కోపగింతువేమోయని కొంచెము——

సుశీ——(తనలో) ఈతఁడు దురుద్దేశముతో నుండినట్లు గాన్పించుచున్నది. కానిమ్ము. ఈతని యభిప్రాయ మీతనినోటనే వినవలయును. (ప్రకాశముగ) అయ్యా! సంకోచించి నీయభిప్రాయము దెలియబరుపకున్న నే నేమనగలను.

వర్త——తపస్వీమణీ! ఇంకను దాపరిక మెందులకు నీయందు నాకనురాగము జనించియున్నది. ఈరేయి నాయభిమతమును దీర్ప నరుదెంతునని వచనమిచ్చిన నీవు కోరినవస్తువులన్నిటి నొసంగెదను.

సుశీ——(తనలో) అక్కటా! ఈతఁ డెంతనీచమగు నభిప్రాయముతో నున్నాఁడు. ఈతని కేమని యుత్తర మొసంగుదును. ఈతఁడు తన యభిమతంబునుదీర్ప నంగీకరింపనిచో నాకు వలసినపదార్థముల నొసంగుటకు సమ్మతింప డనుట నిక్కువము. పదార్థములు సమకూడకున్న యతిథిపూజనమునకు తిలాంజలి యొసంగవలసియుండును.

గీ. కోరగారాని కోరిక కోరునితని
వాంఛితార్థంబు నేను దీర్పంగవలెనొ
యతిథిపూజత్యజించి మర్యాదనిలువ
బెట్టవలెనో దెలియ దవివేకి నగుట.

ఆహా! ఎట్టిసంకటము గల్గెను. రామచంద్రా! మాయెడ విముఖుడవై యుంటివా? లేక నియ్యది పరీక్షాసమయమా! ఇట్టివిషమసమస్యలను గల్గించిన మేము నిలువగలమనియే తలంచితివా? నీపదారవిందసంసేవన మేమరక గావించుచున్నందుల కియ్యదియా నీవు మాకు చేకూర్చునట్టి ఫలితము. రామచంద్రా! నీవే తండ్రివి, నీవే తల్లివి, నీవే గురుండవు, దైవమవని నమ్మియున్నమమ్ము నీవే యిట్లు పరీక్షింపదలంచుట నీకు భావ్యమా!

వర్త——తపస్వీమణీ! ఏమందువు. వస్తువుల నిప్పింపుమందువా?

సుశీ—(తనలో) ఈతని నొకసారి ప్రార్థించిచూచెదను. (ప్రకాశముగ) మహాత్మా! తముబోలు వారు యీవిధి వక్కాణించుచుండ నే మని ప్రత్యుత్తర మీయగలదానను. కోరగారాని కోర్కెను కోరుట మీకు దగునా? తనువస్తువుల కగుమూల్యమును నేట రేపటదెచ్చి యొసంగుదును. అంతులకంగీకరించి యనుగ్రహింప ప్రార్థింతును.

వర్త—ఇంక నూరక నాసంగతి వచింపవలసిన పనిలేదు. సమ్మతించె దవా సరకుల నొసంగెదను. తిరస్కరింతువా మరియొక చోటి కేగి నీకు గావలసినపదార్థములను దెచ్చుకొనుము.

సుశీ—(తనలో) ఈతఁడు తాబట్టినకుందేటికి మూడేకాళ్లని వాదించు వానిచందమున పలుకుచున్నాఁడు. రామా! రామా! అతిథి పూజన మెల్లుసేయగలమని తలంచియుంటిని. కట్టా! అతిథులను, పరమభాగవతోత్తములను, మహిమాన్వితులగు నామదేవజ్ఞాన దేవులను సంతృప్తిపరుప కెట్లు సాగనంపుదును. అంగీకరించి పదా ర్థములను గొనిపోవలసినదేనా? భర్తయు నెట్లో పదార్థము లను సంగ్రహించుకొని రావలసినదని నియమించియుండిరి. పదా ర్థములను గైకొని పోవకున్న పతిమాట కెదురాడినదాన నగు దును. అతిథిపూజనమును త్యజింపజాలను. వల్లభునియానతి జవదాటజాలను. సర్వమున కాపరంధాముఁడే గలఁడు (ప్రకా శముగా) అయ్యా! తాము కోరినట్లుగా నేటిరాత్రి తమచెంత కరుదెంతును. నాకు గావలసినపదార్థముల నిచ్చి పంపుము.

వర్త—(తనలో) ఇప్పటికి నాకోర్కె దీరు ననునాస జనించుచున్నది. ఈమె రాత్రి వచ్చునో రాకుండునో. ఇంతకుదెగించినయీామె రాకుండుటలో నాశ్చర్యమేమియు నుండదు.

సుశీ—ఇంకను జాలమొనర్చెదవేల?

వర్త—నీవు రాత్రికి వచ్చెదనంటివి. కాని నాకయ్యది యంతనమ్మకము గాలేదు.

సుశీ—అయ్యా! అతిథిపూజనమునే త్యజింపజాలని నేను సత్యమును మరచి వర్తింతుననియే తలంతువా?

వర్త—సరే! ఈమాటల్లో యెంతసత్యంవుందో చూస్తాను.

సుశీ—పదార్థములను దెప్పించి యొసంగుము. నాకొరకై యింటియందలివారును నతిథులును వేచియుందురు.

వర్త—ఈజాపితాయందలి సరుకులన్నిటిని మీయింటికి బంపించెదను. ముందుగా నీవేగుము.

(సుశీల నిష్క్రమించును.)

వర్త—(తనలో) రాకుండా యుండదు. ఒకానొకవేళ రాకున్న యెడల నలువురిలో తగవుబెట్టి, యెట్లో సగము సొమ్మైనను గుంజుకొనవచ్చును. సామానులన్నీ పంపిస్తాను.

(నిష్క్రమించును.)

తెరవ్రాలును.

---

## తృతీయరంగము.

### కబీరుగృహము.

[ప్రవేశము:- కబీరు, సుశీల.]

కబీ—నేడు నీవలన నతిథిసత్కారమొనరించునంతటి భాగ్యము చేకూరినది. ఇందులకు నేడు నిన్నెక్కుడుగా నభినందింపవలయును.

సుశీ—(మాటలాడక నిరుత్తరయై మిన్నకుండును.)

కబీ—ఈసామగ్రినంతయు నెక్కడ దెచ్చియుంటివి?

సుశీ—నాథా! వచింపజాలను,.........

కబీ—ఏమీ! చౌర్యమున వీనిని గొనితెచ్చి యుండలేదుగదా?

సుశీ—లేదు. లేదు. ఒకవర్తకునియొద్దనుండి గొనివచ్చితిని.

కబీ—నేడు తురకలపండుగ యగుటచే దుకాణములుగూడ లేవే?

సుశీ—కావుననే......

కబీ—సంకోచింతువేల ?

సుశీ—ఎట్లును వచింపకతప్ప దాలింపుఁడు. ఒకవర్తకుఁడు దుకాణము ను దెరచికొని యుండగా నాతనిని సమీపించి వలసినవస్తువుల నొసంగవలసినదని ప్రార్థించితిని. కాని యాతఁడు మూల్యముగా నరువీయుననియు తనతో నొకరాత్రి.........

కబీ—నిన్నాతఁడు కామించి యుండెనా ?

సుశీ—అగును. అట్లైన వస్తువుల నుచితముగా నిచ్చెదననియెను.

కబీ—అందుల కంగీకరించి యీపదార్థములను గొనివచ్చి యుందువు.

సుశీ—అవును.

కబీ—ఈవిషయమున నీవు చక్కగా వర్తించితివి.

సుశీ—నాథా ! అట్లు వచించెద రేల ?

కబీ—విధాయకముగా నొనరింపవలసినదాని నొనరించితివి. ఇందావంతే యును దోసము లేదు. ఇంకను జాలము సేయుటెంగులకు లెమ్ము. ఆతనియింటివరకును నిన్ను దిగబెట్టెదను. నిస్సందేహముగా నాతనికడ కేగిరమ్ము.

సుశీ—సత్యవ్రతపరిపాలనార్థమై యాతని చెంత కేగుదును. కాని మరలి వచ్చుట—హా ! నేటివరకు తమ్మే దైవస్వరూపులుగా భావించి సేవించుచు రామచంద్రపదరాజీవములనే శరణ్యముగా దలంచి మెలంగుచుందునే. అట్టి నేను పరపురుషునితో సాంగత్యము నెరపవలసివచ్చెను. హాతవిధీ ! నాథా ! ఈ దీనురాలి నింక మరచిపొండు. కళంకితనై నిరంతరము రామచంద్రు నర్చించు తమ్ము సేవింపజాలను. అనుగ్రహము నిల్పుఁడు.

కబీ—సుశీలా! ఇందునుగూర్చి విచారించుచుంటివా? ఇది విషాదమునకు దగిన సమయమా! ఆవర్తకుఁడు నిన్నొకరాత్రికాలమున తనతో గడుపుమని యాశించుటమాత్రమేగాదు. నాజీవితముల నర్పింప వలసినదని కోరియుండినను సంతోష పూర్వకముగా నర్పించియుందును. వేయేల, భగవానుఁడగు శ్రీరామచంద్రుఁడే యాతనిచే నట్లడిగించియుండును. కావున సంకోచింపక సంతోష పూర్వకముగా నాతనిచెంత కేగిరమ్మా.

సుశీ—తమయానతి శిరసావహింతును. నిరంతర మేనును తమరును త్రికరణంబుల నెవ్వనిపాదాబ్జము లేడ్గడయని భావించి సేవించుచుంటిమో యారాముఁడే నాకు రక్షకుడగును

కబీ—లెమ్మా. నిన్ను నే నాతనియింటివరకు దిగబెట్టెదను.

(ఇరువురును పరిక్రమింతురు.)

తెర యెత్తబడును.

(వర్తకుఁడు సుశీలకొరకు నిరీక్షించుచుండును)

వర్త—తప్పక వచ్చెదనని వాగ్దానమొసంగిన యాతరుణీమణి యాలస్యముగావించుటచే చిత్త మూరక పరితపించుచున్నది. క్షణమొక యుగమువోలె గాన్పించుచున్నది.

కబీ—నీకొరకు కాతఁడు నిరీక్షించుచున్నాడు. పోయిరమ్మా. నీకు శుభంబగునుగాక.

సుశీ—(భర్తకు నమస్కరించి వర్తకుని సమీపించును)

(కబీరు నిష్క్రమించును.)

వర్త—తరుణీమణీ! ఇంతవరకు నీకై యెదురుజూచుచున్నాను. ఇంతాలస్యము గావించితివేమి?

సుశీ—అయ్యా! అతిధులను సంతృప్తి గావించి భర్తృసాన్నిధ్యమున
కరిగి వారి కీవృత్తాంతమంతయును దెల్పి వారియనుమతిని బడసి
వచ్చుటలో నొకింత యాలస్యమైనది. మన్నింపవలయును.

వర్త—(నిర్విణ్ణుఁడై యూరకజూచుచు నిలచియుండును.)

సుశీ—అయ్యా! ఇప్పటికే కాల మతిక్రమించినదికదా ?

వర్త—(తనలో) ఈలతాంగియం దొక యపూర్వ తేజ మక్షిగోచరమగు
చున్నది. నిక్కముగా నీమెకళంకరహితురాలనుటలో నసత్య
ముండదు. కట్టా! ఇట్టి మహాపతివ్రతను జెనకదలంచిన నా
యట్టి మూఢుఁడెందైన నుండునా? ఈమెను క్షమాభిక్షను
గోరుకొనకున్న నాపాపమునకు మేరయుండునా! (ప్రకాశము
గా) తల్లీ పూజనీయురాలవగు నిన్నాశించి మహాపాతకమున
కొడిగట్టికొంటిని. మన్నింపుము. (పాదములపై బడును.)

సుశీ—అయ్యా! ఏల నాపాదములపై వ్రాలెదవు. లెమ్ము. లెమ్ము.
శ్రీరామచంద్రునిపాదపద్మముల నాశ్రయింపుము.

వర్త—తల్లీ! పరమపతివ్రతాతిలక మనందగు నిన్నాశించిచందమున జనిం
చిన ఘోరపాపమునకు దగినశిక్ష విధించి యనుగ్రహింపుము.
అంతవరకును నీపాదముల విడువజాలను. తల్లీ కటాక్షింపుము.

సుశీ—సోదరా! గతమును మరచిపొమ్ము. నీ వాచరించినపాపములకు
పశ్చాత్తాపపడుటయే పాపసంఘములను పారద్రోలజాలును.

గీ. అగ్నిదేవుండు నొకట ఘోరాటవులను
భస్మమొనరించునట్లు రఘువర్యునామ
మంత్రమును భక్తి స్మరియించు మాత్రముననె
పాపసంఘంబులెల్లను భస్మమగును.

కావున నీవొనర్చినపాపముల పారద్రోలి సద్గతిని చేకూర్చు రామతారక మంత్రంబు నుపాసింపుము.

వర్త—అనుగ్రహింపబడితిని. తల్లీ! తమనిలయమునకు గొనిపోయెదను.

లెమ్ము. త్వరపడుము. నీవల్లభుఁడు నీరాకకై నిరీక్షించుచుండును.

(ఇరువురును నిష్క్రమింతురు.)

తెరవ్రాలును.



# భక్తకబీర్

## షష్ఠాంకము.

---

### ప్రథమరంగము.

ఒకవీథి.

[ప్రవేశము :—కబీరు, కమాలు.]

కబీ—కుమారా! రేపటిదినంబున సాధువులకు సదావర్తినొసంగుట కింట నేపదార్థమును లేకపోవుట యెఱుంగుదువుగదా?

కమా—అవును. అయిన నిప్పు డీయర్థరాత్రమున నిట్లరుదెంచు టెందులకు?

కబీ—పదార్థ సంపాదనముకొఱకు.

కమా—ఇంతటి యర్థరాత్రమున మనమరుదెంతుమని యెవ్వరు నిరీక్షించుచుందురు. ఉదయముననే బయలుదేరినయెడల కొంతవరకు మేలగునేమోయని తలంచుచున్నాను.

కబీ—కుమారా! యాచనవలన పెక్కురుసాధువుల కొసంగుటకు సరిపడునన్ని పదార్థములు లభించునా?

కమా—ఏవిధమున ద్రవ్యమును సంపాదించదలచితిరి?

కబీ—ధనికులయొద్దనుండు ద్రవ్యమును గొననుద్దేశించితిని.

కమా—ధనికులు బుద్ధిపూర్వకముగా నడిగినంతమాత్రమున ద్రవ్యమి
చ్చుట కంగీకరింతురా?

సీ. బిరుదులకాశించి ♦ వేలకొలందిని
వెచ్చింపవలసిన ♦ వెనుకబడరు
గొప్పకై పలువురు ♦ జెప్పుకొనంగను
దాతకైవడినుండ ♦ దలచువారు
ఇంద్రుండవాదువు ♦ చంద్రుడవాదువటంచు
స్తుతియింప నే బీయ♦జూచువారు
పొగడించుకొని డబ్బు ♦ బుద్ధిపూర్వకముగ
నీయలేక మిటకరించువారు.
నగుచు ధనికులుంద్రు దము♦రాత్మ నెఱిగి
వారివలనను ధనసము♦పార్జనంబు
చేయసమకట్టిరేల నీ ♦ హేయమైన
కార్యమునకంటె మేలు భి♦క్షాటనంబు.

ధనికు లైశ్వర్యమదాంధులు, నుచితానుచితజ్ఞానశూన్యులై యాచకుల
కంటె కగపడుటయే నగౌరవమని తలంతురు. అట్టివారి నాశ్రయించుట
కంటె భిక్షాటనమున లభించినదానితో సాధువులకు సదావర్తి యొసం
గుట మేలుగదా?

కబీ—నాయనా! నీవు చెప్పినపల్కులన్నియు యథార్థములు. ధనికులు
ధనమును సంపాదించుటలోగల కాయకష్టము లెఱింగినవారగు
టచే నొకనేబు వ్యయించుటకుగూడ వెనుదీయుదురు. అట్టిలోభి
జనులయర్థము, భూపాలునకుగాని చోరులకుగాని ప్రాప్తమగు
చుండును. మనము భూపతులముగాము. అట్టిధనికులనుండి ధనం
బును గైకొనుటకు మనకు శేషించిన మార్గమొక్కటిమాత్ర
మున్నది.

కమా—చోరత్వముననా ధనమును సంగ్రహింపదలంచుట?

కబీ—అవును.

కమాల్—తండ్రీ! అయ్యది యకార్యముగాదా? మిముబోలిన మహానుభావులు నిందను నేవిధంబున భరింపనేర్తురు?

కబీ—కుమారా! లోకులనిందాస్తుతులతో నిమిత్తమేమున్నది.

కమాల్—జనకా! లోకు లెట్లనుకొనిన మనకేమని తలంచి యకార్యమొనరింపనగునా ? మనచారిత్రముల నాదర్శకముగా గొని యితరులుగూడ నిట్లే గావింతురే.

కబీ—నాయనా! మనచరిత్రముల నాదర్శకముగా గైకొనినవారు మెప్పుడును యిట్లొనర్పరు. అట్టివా రిందలి పరమార్థ మేమైయుండు నాయని వితర్కము గావించి యాలోచింతురు. మూఢులును, డాంబికులును, మోసగాండ్రును, స్వార్థపరాయణులును పరమార్థచింతనము చేయక స్వప్రయోజనార్థము గావించు చౌర్యమిట్టిదెన్నడును గానేరదు. వారు పరేతనాయకునిమ్రోల దగునట్లు దండింపబడుదురు.

కమా—జనకా! ఇందొక పరమార్థముగూడ నున్నదా?

కబీ—ఉన్నది.

కమా—ఏమది ?

కబీ—అతిథిపూజన మవశ్యకర్తవ్యము. కావున చోరత్వముననైన ధనమును సంపాదించి మహాత్ములగు నతిథులను సంతృప్తిపరుపవలయును. కావున సంకోచింపకుము. నే నీవర్తకుని గృహమునకుం గన్నము త్రవ్వెదను. లోనికేగి వస్తువులను గొనివచ్చి నీ కందించెదను. వానిని నీవు భద్రముగా నింటికిగొనిపొమ్ము.

(అని కన్నమును త్రవ్వును)

కమా—జనకా! మీరేల శ్రమపడవలయును. నేనే లోనికేగి ధనమును సంగ్రహించుకొనివచ్చెదను. తమ రిండే యుండుడు.

కబీ—మంచిదట్లే గావింపుము.

(కమాలు లోనికేగును.)

కబీ—గతజన్మంబున నీతఁడొనర్చిననేరమునకు దగినశిక్ష ననుభవించినగాని జన్మరాహిత్యమును బొందజాలఁడు.

(కమాలు ధనముగలసంచి నందించును)

కబీ—(అందుకొనును)

కమా—జనకా! మన మీధనమును గొనిపోయినవెనుక నెవ్వడేని యరుదెంచి మిగిలినద్రవ్యమంతయును గొనిపోగలడు.

కబీ—అగునగును.

కమా—కావున నే నీవర్తకుని మేల్కొల్పి హెచ్చరించి శీఘ్రముగ వెలికరుదెంచెదను.

కబీ—నీయిష్టము.

(కమాలు లోనికిపోయి మరల కన్నములోనుండి తలదూర్చి.)

కమా—జనకా! కార్యము మించివచ్చినది. వర్తకుఁడు నన్ను లోనికి లాగుచున్నాఁడు.

కబీ—మోసమయ్యెనే!

కమాల్—తండ్రీ! ఆలోచనల కెడము లేదు. నాగుర్తులీతనికి జిక్కకుండ శిరమును ఖండించుకొనిపొమ్ము. అట్లుకాదేని నేను రేపటిదినమున రాజదండనమునకు గుఱియగుటయేగాక తమకుగూడ యపకీర్తిగలుగును. సంకోచింపకుఁడు.

కబీ—అట్లుచేయుదును.

తెరపడును.

## ద్వితీయరంగము.

### కబీరు గృహము.

[ప్రవేశము: కబీరు, సుశీల.]

కబీ—తరుణీ! సాధువులు వచ్చి వాకిట గూరుచున్నారు. కావున త్వరలో వంట గావింపుము. వారు మహాత్ములు. పెక్కామడలదూరము నుండి నెక్కుడుగా శ్రమజెంది యుందురు.

సుశీ—మహాప్రసాదము. కుమారుఁ డెక్కడ కేగినాఁడు. ఆతఁడున్న యెడల నాకు కొలదిగా చేదోడు వాదోడుగా నుండును.

కబీ—ఆతఁడు రామునికడ కేగెను.

సుశీ—ఎప్పటికి రాగలఁడో. కానిండు. ఇదే స్నానమున కేగివచ్చెదను.

(నిష్క్రమించును.)

కబీ—వాకిట నెందఱో సాధువులు భిక్షార్థ మరుదెంచి నిరీక్షించుచు న్నారు. వారల కీవృత్తాంత మేమియును దెలియనీయగూడదు. ఈమె కీవృత్తాంత మొకింతదెలిసినను, వంటచేయుట మాని కుమారునికొరకై విచారించుచు గూర్చుండును. సర్వమున కా రాముడే గలఁడు. ఇంక నిక్కడ గూర్చుండుటెంతవలకు. పూజా మందిరమున కేగి రామదేవునిచరణసరోజముల నర్చించెదగాక.

(పరిక్రమించును. తెరయెత్తబడును.)

### పూజామందిరము.

కబీ—(శ్రీరామునకు నమస్కరించి)

శ్లో. వందే సాగరగర్వభంగవిశిఖం వందే జగజ్జీవనం
వందే కౌశికయాగరక్షణకరం వందే గురూణాంగురుం
వందే బాణశరాసనోజ్జ్వలకరం వందే జటావల్కలం
వందే లక్ష్మణభూమిజాన్వితకరం వందే సదారాఘవం.

శ్లో. సాకేతే మణికోటిభిస్సుఖచితే దివ్యాంబరాలంకృతే
హేమస్తంభసహస్రకోటిఘటితే తారాపథాత్యున్నతే
రమ్యస్స్వర్ణమయే విచిత్రభవనే దివ్యంతరిక్షే ముదా
రామం స్మేరముఖాంబుజం రఘుపతిం సీతాసమేతంభజే.

[కొందరు సాధువులు అరుదెంచి భోజనపాత్రములచెంత గూర్చుండి యుందురు. కబీరు వారికెదురుగ నరుదెంచును. సుశీలవచ్చి కబీరుచెంత నిలువబడి యుండును.]

కబీరు—మహాత్ములారా! తమరు మాయింటికి నతిథులై యరుదెంచుట చేత మాగృహము పావనమయ్యెను. తమరే నాపాలిటరామ భద్రులని తలంతును.

సుశీ—మహాత్మా! వడ్డన గావింపుదునా?

1 సాధు—అమ్మా! ఇంకను గొందరు వచ్చియుండలేదు. వారుగూడ నొకటి రెండు నిమిషములలో రాగలరు. ఇంతలో మించిపోవు నది లేదుగదా ?

2 వ సాధు—అనంతకల్యాణగుణసంపన్నుడగు రాముని స్తవరాజములను తమవలన వినుటవలన మాపాపములు పటాపంచలైనవి.

కబీ—రామనామమున నట్టిమాహాత్మ్యమున్నది.

సీ. మంత్రంబులందు ను | త్తమమైనదగుటచే
పార్వతీనాథుండు | పఠనసేయు
మంత్రసారంబౌచు | మహిజెలంగుటచేత
పావని జపియించు | భక్తితోడ
సరిలేనిదగుటచే | వరయోగిసంతతి
ధ్యానింతు రెవ్వేళ | నధికభక్తి
పావనమగుటచే | బ్రహ్మర్షిగణమెల్ల
భక్తితన్మయులౌచు | పఠనసేతు

రట్టిరాముని నామమాహాత్మ్యమిట్టి
దనుచు వచియింపనలవియే హరిహరాదు
లైన తారకమంత్ర మహాత్మ్యమే మొ
తెలుపజాలరనెడు నుడి గలదుజగతి.

అనంతకల్యాణగుణుండగు రామచంద్రుఁ డుద్భవింపగలడనియే వశిష్టమహా
మునీంద్రుఁ డిక్ష్వాకువంశమునకు పురోహితుఁడై యుండ నంగీకరించెను.
శ్రీరామచంద్రసందర్శనాసీతుఁడై శరభంగుఁడు మేన ప్రాణములధరించి
యాతని సందర్శించువరకు నిలచియుండెను.

సుశీల—(తనలో) ఏమో చిత్రముగానున్నది. కుమారుఁడు భోజనము
నరించువేళకైనను యింటికి రాకుండెను. అనుష్ఠానమును దీర్చుకొ
నుటకేగిన యోగులును యేలకో రాకుండిరి.

1 యో—మహాత్మా! నేటికి తమవలన తారకమంత్రరహస్యార్థమెఱుం
గుట మాపూర్వజన్మసంచితార్థమని తలంచుచుంటిమి.

[ప్రవేశముకొందఱు యోగులు.]

2 వ యో—జ్ఞానదేవా ? ఇంతజాల మొనరించితివేమి ?

జ్ఞాన—(ఆసనముపై కూర్చుండుచు) జపతపంబుల చాలించుకొని వేగము
గా రావలయునని యే బయలుదేరితిమి.

1 యో—మార్గమధ్యమున జాలమొనర్చితివా ?

2 యో—మార్గమున నేలయాగిపోతివి. ఎవ్వరితోడనైన మాటలాడు
చుంటివా ?

జ్ఞాన—లేదు లేదు. ఈయూర నేను మాటలాడుట కెవ్వనినెఱుం
గుదును?

1 యో—మరి నీయాలస్యమునకు కారణమేమి ?

జ్ఞాన—రచ్చకొట్టమునకు సమీపమున నెవ్వడో యొకబాలునిశవము
వ్రేలాడదీయబడి యుండెను. ఆశవమునకు శిరము లేదు. కాని

యదెట్టిజీవనమో! దేహమునుండి శిరము ఛేదింపఁబడినను దేహాభిమానమును విడచినట్లు లేదు.

1 యోగి—అదేమి! ఆశవ మెవ్వరిదై యుండును?

జ్ఞాన—ఆతఁ డొక చోరుడట. ఆతఁడు గడచిన రేయి యొకవర్తకునింట చొరబడి వెలుపలనున్న తనవానికి ద్రవ్యమందించెనట. ఇంతలో నావర్తకుఁడు మేల్కాంచి కన్నములోనుండి వెలికరుదెంచుచున్న యాబాలునికాళ్ళు పట్టుకొని లాగుచుండెనట. ఆసమయమున వెలుపలనున్న వాఁడు తమ గుర్తు లితరులకు చిక్కకుండ నుండవలయునని యాబాలునిశిరమును ఛేదించుకొనిపోయియుండెనట.

2 యో—ఆబాలుని మొండెమున జీవమున్నదని యెట్లు గ్రహింపగల్గితివి?

జ్ఞాన—ఆమొండెము మార్గమునబోవువారలెల్లరకును చేతులెత్తి మ్రొక్కుచున్నది. ఆవింతను దిలకించుచు నట్లే నిలువబడియుంటిని. ఇంతట నాత్మారాముఁడు వేళయైనదనిబోధింప మీరు నాకొరకై కని పెట్టుకొనియుందురని త్వరితగమనమున జనుదెంచియుంటిమి.

కబీ—మహాత్ములారా! భోజనముల గావింపుఁడు. ఇప్పటికే చాలయాలస్యమైనది.

జ్ఞాన—(సుశీలతో) అమ్మా! వడ్డన గావింపుము. ఆమహాశయునకును, కమాల్ నకునుగూడ మాపంక్తినే వడ్డింపుము. వారితో గలసి భుజించినగాని మాపాపములు పటాపంచలు గానేరవు.

కబీ—మహాత్ములారా! తమరు భుజింపుఁడు.

జ్ఞాన—తమసహపంక్తిని భుజింపవలయునని యాశించితిమిగాని—

కబీ—క్షమింపుఁడు. శ్రీరాముని పూజించినపిమ్మటగాని భుజింపను.

1 యోగి—అయిన కమాలునైన మాపంక్తిని భుజింపబంపుము.

సుశీ—(తనలో) ఏలనోగాని ప్రాణేశ్వరుడు నిరుత్తరుఁడై కన్నులనీరుబెట్టి ముఖమునువాల్చి శోకించుచున్నాడు,

జ్ఞాన—మహాత్మా! మే మంతటిభాగ్యమునకై నసోచుకొనజాలమైతిమా?
కబీ—(తనలో) ఇపు డీమహానుభావుల కేమని వచింతును.
1 యోగి—(సుశీల) తల్లీ! కుమారు డింటియందు లేడా?
సుశీ—లేడు. ఎచ్చటికేగియుండెనో తెలియరాకున్నది.
కబీ—మహాత్ములారా! భోజనములగావింపుడు. అనంతరమతఁడు రాగలడు.
2 యోగి—(జ్ఞానదృష్టిచే కనుగొని) కబీరుమహాశయా! జ్ఞానదృష్టిచే సర్వమును కనుగొంటిని. జ్ఞానదేవా? అయినయాలస్య మెట్లు అయినది లెమ్ము. ఆశవఖండమును గ్రిందకిదింపుచుండుము. నే నింతలో యాశవముయొక్క శిరమును గొనివచ్చెదను. పరమ భక్తాగ్రేసరుఁడగు నాకమాల్ దాసు పునర్జీవితుఁడై సహపంక్తి భుజింప నరుదెంచును. (జ్ఞానదేవుఁడు నిష్క్రమించును.)
2 యోగి—మహాత్మా! శిరస్సును మాకొసంగవలయును. తమ యనుజ్ఞ లేకుండ మే మేమిజేయుట కశక్తులముగదా?
కబీ—ఆయింట గలదు. (అని చూపును.)
(2 యోగి నిష్క్రమించును.)
సుశీ—నాథా! కుమారుఁడు మరణించెనా? హాపుత్రకా! కడకు తండ్రి చేతనే వధింపబడినాడవా? (మూర్ఛిల్లును)
కబీ—సుశీలా! (అని యామెను సమీపించి మూర్ఛదేర్చును.) ఏమి నీపుత్రవ్యామోహము. ఎవ్వడు పుత్రుడు. ఎవఁడు తండ్రి. ఋణానుబంధరూపులగు పుత్రమిత్రహితాదు లస్థిరములనుట యెఱుంగవా! జనించినవాఁడెల్ల సంచితప్రారబ్ధకర్మ మనుభవింపకపోడు. అట్లే కమాలుఁడు తన సంచితార్థమునకు దగినదండమును పొంది జన్మరాహిత్యమును బడసినాఁడు. ఇందులకై విచారింతువా?

[ప్రవేశము:—కమాలు, 2 యోగి, జ్ఞానదేవుడు.]

(కమాల్‌దాసు భజనసేయుచు ప్రవేశించి తండ్రికినమస్కరించును.)

కబీ—వత్సా! పురాకృతపాపఫల మనుభవించి జన్మరాహిత్యము బడసినాడవు.

2 యోగి—ఈతఁడు పురాకృతకర్మఫల మనుభవించినాడా? అదెట్లు?

కబీ—తొల్లిటిజన్మమున సీత శోకవర్తకుని క్రోధోన్మత్తుఁడై వధించియుండెను. ఆవర్తకునితనయుఁ డీతనిని వధింపవలయునని దలంచుచు మృతినొంది ఆతఁ డీజన్మమున మరలవర్తకుఁడై యైశ్వర్యముగల్గి జనించెను. ఈతఁ డాపాపఫల మనుభవింపవలసియుండుటచే నే సీతని యావర్తకుని గృహమునకే గొనిపోయితిని. ఈతఁ డాపాపమునకుదగిన దండన మనుభవించియున్నాఁడు. కాని మహానుభావులారా! తాము నాయందుగల యనురాగముమెఁపున ఒకతుచ్ఛజీవనమునకై రామనామత్రయమును వ్యయమొనర్చిరి.

యోగి—మహాభాగా! ఆవిషయమున మీరు చింతింపనక్కరలేదు.

కబీ—ఏల?

2 యోగి—మహాత్మా! మేము తొలుదొల్త పవిత్రులమగుటకై యొకమారును, కమాల్‌జీవములకొరకొకమారును అచ్చట సమావేశమైయున్న జనులందరకును రామనామమాహాత్మ్య మెరుకవడుటకును:వారలకు భక్తిమార్గ మలవడుటకును మూడుసార్లు రామనామమును స్మరించితిమి.

జ్ఞాన—మహదానందసంధాయకుఁడగు రామచంద్రుని మరల నొక్కసారి భజించి భోజనముల గావింతముగాక.

(అందరును వెనుకటికీర్తన పాడుచు భజనసేయుచు నిష్క్రమింతురు.)

తెరపడును.

---

# భక్తకబీర్

## సప్తమాంకము.

---

ప్రథమరంగము.

కబీరుదాసుగృహము.

[కబీరుదాసు, కమాలు, సుశీలయు నుచితాసనములపై గూర్చుండి యుండగా తెరలేచును.]

కబీ—వత్సా! ఇనవంశాబ్ధిచంద్రుడగు రామునికంటె నెక్కుడగు దైవము లేడు. ఈవిషయము నేమరక భాగవతగోష్ఠి సల్పుచుండుము. నాకు శ్రీరామాజ్ఞయైనది. దేశాటనము మొదలిడి జీవితశేషమును గడపుటకు నిశ్చయించితిని.

సుశీ—నాథా! మ మ్మెవరికప్పగించి యిలువెడలిపోయెదరు?

కబీ—తన్వీ? ఏటికీవిచారము. రాముఁడే రక్షకుడు. మిమ్ముల నాపరంధాముఁడే కాపాడగలఁడు.

ఉ. రాముఁడె మీకురక్షకుఁడు రాముఁడె మీపరిపోషకుండు శ్రీ
రాముఁడె యాప్తుడౌను రఘురాముఁడె దైవము భక్తితోడ శ్రీ
రాముని నామకీర్తన పరాయణులై చరియించుమీకు సర్వమా
రాముఁడె యౌనటంచును నిరంతరమాత్మ దలంపుచుండుమా.

సుశీ—నాథా! ఇంకను గొన్నిదినములు పోయినపిమ్మట దేశాటనకు బోవరాదా?

కబీ—ఇంకను ఈసంసారసాగరమునజిక్కి పరితపించుచుండవలసినదేనా? శతవత్సరపరిమితంబైన నాయువున నర్ధంబు నిద్రాదికంబుల వ్యర్థమై చనుచుండును. శేషించినయర్ధంబునం దర్ధంబు బాల్యయౌవనకౌమారాది యవస్థలగడచు. తక్కినయర్ధంబున వివిధాశ్రమంబుల తాపత్రయా భీలదావాగ్నుల జిక్కి సంసారమున పరిభ్రమించుచుండు. మానవులకు భగవంతునారాధించుటకు సుంతయేని యవకాశము లభింపకుండును. కావున మనుజుఁడు తనకవకాశము గల్గినపుడెల్ల భగవంతు నారాధింపవలయును. ఇంక గొన్నిదినంబు లేగినపిమ్మట భగవంతు నారాధింతునని యిపుడుపేక్షించుట జ్ఞానుల లక్షణముకాదు కావున యింక నెట్టియడ్డంకులు వచించినను రామాజ్ఞ నతిక్రమించి చరింపజాలను. కుమారా! కమాలు! నీకు జెప్పవలసినవిషయముల దెల్పెద నాలింపుము.

సీ. రామనామము మంత్ర రాజములందుత్త
మమయిన దనుట నే మరువకన్న
సంసారమను మహా సాగరముతరింప
భక్తిమార్గంబు చే పట్టుమన్న
భాగవతులనెల్ల భగవంతు డగురాము
గానెంచి సేవింప గడగుమన్న
సాధుసంసేవ మోక్షప్రదమనుట నీ
మానసంబున నిల్పి మసలుమన్న
భక్తితత్వంబు వెల్లడి పరపుమన్న
సజ్జనులజేరి సేవల సల్పుమన్న
ప్రబలియున్నట్టి మతకక్ష లత్యజించి
సర్వసమ్మత మగునట్లు జనగదన్న.

యక్తాయుక్తవిమర్శనజ్ఞానయుతుండవైన నీ కీసమయమున నింతకంటె జెప్పవలసిన దేమియును లేదు. సంసారసాగరతరంగముల జిక్కువడి యా పరంధాముని నామస్మరణ నేమరకుండుము.

కమా—జనకా ! తమయుపదేశానుసారము వర్తించెదను. తమ్మొక్కటి యర్థించెదను.

కబీ—ఏమది ?

కమా—సంసారమున జిక్కుకొనిన వ్యామోహమున మునుంగకుండు టెంతవానికైన నసాధ్యము కావున నాకు.........

కబీ—నీయిచ్ఛవచ్చినట్లు గావింపుము. అందులకు నాయనుజ్ఞతో నిమిత్తము లేదు. మాతృదేవతారాధనము కర్తవ్యము గావున నీజనని యనుజ్ఞ గైకొనుము.

కమా—అనుగ్రహింపబడినాడ.

కబీ—రామచంద్రా! నీయానతి శిరసావహించి దేశాటన కిదే బయలు దేరుచున్నాడను.

(కబీరు అనుబంధమును పాడుకొనుచు నిష్క్రమించును. కమాల్ దాసును, సుశీలయు ననుసరింతురు.)

తెరవ్రాలును.

---

## ద్వితీయరంగము.

[కబీరుదాసు! వెనుకటియనుబంధమును పాడుకొనుచు ప్రవేశించును.]

కబీ—(పాడుట ముగించి) సత్యజ్ఞానానంద స్వరూపుఁడు రామచంద్రుని పదరాజీవసంసేవనమే యిహపరసాధనము. అజ్ఞానులగువార లింద లిపరమార్థమును గుర్తింపక సులభముగాఁ దరింపగలమార్గమును విడచుచున్నారు. సోదరులారా! "కలౌ స్మరణాన్ముక్తిః" యను సూక్తిని మరువకుఁడు. పరంధాముని సాన్నిధ్యమును

జేరుటకై తొల్లిటియుగంబున జపతపంబులును, యజ్ఞయాగము లను గావించుచు యమనియమాదుల నభ్యసించి యెక్కుడు కష్టముల నొందవలసియుండెను. కాని యీకలియుగమున నట్టి యిక్కట్ల నొందవలసినయగత్యము లేదు. నామసంకీర్తనప్రభావ మున మహామునులకైన దర్శింపగారాని పరమాత్ముని సాక్షా త్కారమును బడయవచ్చును. భగవన్నామసంకీర్తనమునకు సమ యమొక్కటి గల్గించుకొనియెదనని తలంచి యుపేక్షింపకుండు. ముందెన్నడో జేయుటకు నిశ్చయించుకొనిన భగవన్నామసంకీ ర్తనమునకు నెట్టియడ్డంకులుగల్గునో నిర్ణయింప నసాధ్యము, జలబుద్బుదప్రాయమైన దేహ మనిత్యమగుటచే నెప్పు డేసమ యమున ప్రాణవాయువులు పంచత్వమొందునో నిర్ణయింపన సాధ్యము కావున దీపముండగనే గృహంబును జక్కపెట్టుకొన వలసినచందమున నెంతచిన్నయవకాశము లభించినను రామ నామస్మరణ మాచరింపుడు.

[ప్రవేశము పులక్పుకారు]

పుల—(కబీరునకు నమస్కరించి.) మహాత్మా! అనుగ్రహింపవలయును.

కబీ—(పులక్పుకారును లేవనెత్తి.) నాయనా! నిగ్రహానుగ్రహసమర్థుం డగు శ్రీరామచంద్రుండే నిన్ననుగ్రహింపగలడు. వత్సా! నీ వెచ్చటనుండి యిట్లరుదెంచుచున్నావు?

పుల—నే నొక క్షత్రియుడను. తాము వారణాసీపురంబున నుందురని విని తమ్ము సందర్శింపవలయునని యచ్చటికరిగి తమసందర్శనము లభింప లేదని చింతించుచు నిట్లరుదెంచి నాభాగ్యవశమున తమ్ము సందర్శింపగల్గితిని.

గీ. భాగ్యవశమున తమపాదపద్మములను
గాంచినాడను, యిక నో యఖండతేజ

భవమహాంభోధి దాటెడు కేవలను దెల్పి
బ్రోవవలయు నటంచును కే మ్రొక్కుచుంటి.

కబీ—(తనలో) ఈతఁడు మోక్షాసక్తిగలవాఁడే యగును గాని యిం కను యుపదేశమును బడయవగినంతటి మనోనిశ్చలత జెందియుం డలేదు. ఇప్పుడీతనికి యుపదేశమొసర్చుటకు దగినసమయము గాదని జెప్పిన నెంతయు చింతించును.

పుల—స్వామీ! సంకోచించుచుంటిరా! లేక తమమౌన మంగీకార సూచకమా!

కబీ—నాయనా! ఉపదేశమున కేమున్నది. మతద్వేషమును విడచి సమస్తజీవరాసులకును దైవమొక్కడేయనుట మానసంబున దలంచుచుండుము. నీ వేనామమున భగవంతు నారాధించిన నా తఁడారూపమున సాక్షాత్కరింపగలఁడు. పరాత్పరుఁడు నామ రూపగుణరహితుఁడు కాని యజ్ఞానులమగు మనము రామకృ ష్ణాదినామముల నాపరాత్పరు నారాధించుచుందుము నాయ నా! భగవన్నామసంకీర్తనమునకు సాటియగునదెద్దియును లేదు. కావున నీవు దీక్షయుండునపుడెల్ల నీయిష్టదైవమును స్మరించు చుండుము.

పుల—అనుగ్రహింపబడితిని. మహాత్మా! నాయందు వాత్సల్యము నిల్పి నాగృహము పావనముసేయ దయచేయవలసినదని ప్రార్థిం చుచుంటిని.

కబీ—వత్సా! ఇది సమయముగాదు. నేను త్వరలో పండరీపురమున కరగి మరలివత్తును. అపుడు నీవు కోరినట్లుగా నీగృహంబున కరుదెంచెదను.

పుల—మహాత్మా! అనుగ్రహింపబడినాడను. నన్నుగూడ తమతో పండరీపురమునకు గొనిపోవలసినదని ప్రార్థించుచుంటిని.

కబీ—వత్సా! ఇపుడు నీవంతగా శ్రమపడవలసినయగత్య మేమియు లేదు. నాతోనరుదెంచిన నిద్రాహారములకుగూడ లోపముగలుగవచ్చును. నీ కాపండరినాథుని దర్శనభాగ్యము త్వరలోననే గలుగగలదు.

పుల—తమరనుగ్రహించిన నట్లే యగునుగాక.

కబీ—వత్సా! పోయిరమ్ము. సత్పథంబున వర్తించుచుండుము.

(వెనుకటికీర్తనను పాడుకొనుచు నిష్క్రమించును. పులకప్పకా రనుసరించును.)

---

## తృతీయరంగము.

[పులకప్పకారుని అంతఃపురము.]

చక్కగా నలంకరింపబడిన శయ్యామందిరము అందున్న పులకప్పకారుని శయ్యాతలమున నొకపరిచారిక పరుండియుండగా తెర లేచును.

[ప్రవేశము పులకప్పకారు గొందఱు సుందరీమణులతో]

పుల—(తనలో) నిక్కముగా వచింపవలయునని సుందరులగు మందయానలతో నిరంతరము సంచరించుచుండగా జనించు బ్రహ్మానందమునకు పారముగలదా?

1 సుంద—(పులకప్పకారునిసమీపించి) మహారాజా! ఈచిత్రపటములు సుందరమగు నీశయ్యా మందిరమున సుందరతమమైనదానిగా నొనరించుచున్నవి.

2 సుం—ఈ శయ్యామందిర రామణీయకత మీ శయ్యాతలమువలన నినుమడించుచున్నది.

పులకప్పకా—(పరిచారికను చూచి క్రోధోన్మత్తుఁడై) దుర్మతీ! నీ నాయంతర మెంఱుగకుండ నాశయ్యాతలంబున బరుంటివా? నీమదమడంచెద నుండుము, ఓరీ! ఎవరక్కడ.

[ప్రవేశము సేవకుఁడు.]

పులక్సు—ఓరీ ! నీవేగి నల్వురు దండధరులను గొనివచ్చి యీమదాం ధురాలిని బాగుగా నాయెదుటనే జావగొట్టి యావలకుఁ గొని పోవుదు?

[సేవకుఁడు నిష్క్రమించి మరినల్వురు వేత్రహస్తులతో ప్రవేశించును. సేవకులు పరిచారికను గొట్టుచు శయ్యాతలమునుండి క్రిందికీడ్చెదరు.]

స్త్రీ—మహారాజా! క్షమింపుడు ప్రార్థించుచున్నాను.

పుల—చూచెదరేమి.

[సేవకులు స్త్రీని గొట్టుచుందురు, ఆస్త్రీ ఏడ్పుటకుమారుగా నవ్వుచుండును.]

పుల—ఓరీ ! ఆగుఁ డాగుఁడు. ఓసీ ! నాభటులు బాధించుచుండగా నేడ్పుటకుమారుగా నవ్వెదవేల ?—

స్త్రీ—మహారాజా! నీయొనరించుచేష్టల గమనించుటచే సంతాపమునకు సంతోష ముదయించుచున్నది. ఇట్టివిపరీతచేష్టలు చేయువా రెందునుండబోరు.

పులక్—ఏమీ ! నాచేష్టలు విపరీతములా ?

స్త్రీ—ఇంచుక విమర్శనదృష్టితో పరికింపుము.

పులక్—నాచేష్ట లెట్లు విపరీతములయ్యెనో తెలుపగలవా ?

స్త్రీ—ఒక్కమారు యీశయ్యాతలమున బరుండినందులకు నన్ను బా ధించుచుంటివే. అనవరత మీశయ్యాతలమున నిద్రించునీకు భగవంతుడు యెట్టిశిక్షల నొసంగగలడో యాలోచించితివా ? ఇంతటిక్రోధరసావేశుడ వగుటచేతనే కబీర్ మహాశయుడు నీ కుప దేశింపడయ్యెను.

ఫులక్—(తెలివిదెచ్చుకొని పరిచారికపదములపైపడి) తల్లీ! కటాక్షింపుము. అనుగ్రహించి పరమును సాధింపగలమార్గమును బోధింపుము.

స్త్రీ—(రాజునులేవనెత్తి) మహారాజా! తమకుపదేశమొసర్చునంతటి దాననా. మోక్షాపేక్షగలవాడు సన్మార్గమున నడచుచు కాంతాకనకములయెడ విముఖుడై వర్తించుచుండవలయును. కబీర్ మహాశయునిచే ప్రబోధమును బడసియు నిట్లు కాంతావ్యామోహమునబడి పరిభ్రమించుచున్న నీకు సన్మార్గోపదేశ మాకబీర్ మహాశయుడే యొసర్పవలయును.

ఫులక్—ఇప్పుడు నా కామహాశయుని సందర్శన మెట్లు లభించును?

స్త్రీ—రాజా! ఆమహాత్ములిప్పుడు పండరిపురమునందున్నారు. పాండురంగని యుత్సవము లత్యంతానందదాయకముగా జరుగుచున్నవి. వలయునెడ నీవేగి యామహాత్ముని సందర్శించి యుపదేశమును బొందుము.

ఫులక్—తల్లీ! అనుగ్రహింపబడినాడను నేనిపుడే పండరికేగి యామహాత్మునియుపదేశమును బడసెదను.

(నిష్క్రమింప తెరవ్రాలును.)

---

## తురీయరంగము.

### పండరీపుర దేవాలయాంతర్భాగము.

[పాండురంగనాథునకు ఒకప్రక్క కబీరుదాసును ఫులక్పుకారును నిలుచబడియుందురు. రెండవప్రక్క జ్ఞానదేవనామదేవులు నిలువబడి యుందరు. మరికొందరుభక్తులుగూడ నిలచియుండును.]

కబీ—

శా. దేవా! యుష్మదనుజ్ఞ గైకొని భవద్దివ్యాంఘ్రి పద్మమ్ములన్
సేవింపంగ నిటేగుదెంచితిని; రక్షింపంగ భక్తావళిన్

నీవే దక్క మఱెవ్వరోపుదురు తండ్రీ! వేడుచున్నాడ నన్
బ్రోవం జెల్లును పాండురంగ! యనయంబున్ సత్కృపాపూర్ణతన్ !

పులక్సు—

శా. ఈసృష్టిస్థితినాశనాధిపతివై యెంతేవిరాజిల్లుచున్
నీసంబేనికొంత గూర్పక కృపాబ్ధీ! యెట్లు మమ్మెంతయున్
వాసింగూరిచి బ్రోవుచుంటివో యటేవాత్సల్యతన్ బ్రోవుమా
ఓసర్వేశ! భవత్పదాబ్జయుగసేవోద్రేకమున్ గూర్చుచున్.

నామ—

శా. పూర్వం బేసుకృతంబొనర్చితినో యిప్డున్ భక్తిమీరంగ నిర్
గర్వంబింతయు లేక పూజసలుపంగా నోచుటయ్యెన్ గదా!
యుర్విన్ నీపదసేవకంటె గలదే యుత్కృష్టభాగ్యంబు శ్రీ
సర్వేశా! యది లభ్యమయ్యె మదికిన్ సంతోషమయ్యెం గదా!

పాండు—కబీర్! హిందూమహమ్మదీయోద్ధరణమునకై ప్రచారము
సల్పి యంత్యమున నాసాన్నిధ్యమును జేరునట్లుగా ననుగ్రహిం
చినాడను. ఇంక నీవాంఛిత మేమో యెఱిగింపుము.

భరతవాక్యము.

కబీరు—తే.గీ. భక్తిరసమగ్నులై యొప్పు భక్తజనము
లెన్నడు విపత్తు లనుమాట యెఱుగ నటులు
నృపవరులు సత్కవుల నాదరించునటులు
నిలగఱవు లేనియటు గటాక్షింపు దేవ!

పాండు—అట్లే అనుగ్రహించితిని.

తెరవాలును.

సప్తమాంకము.

సంపూర్ణము.

# అనుబంధము

పేజీ 5. పంక్తి.

తమాలు——

ఎఱుగవా ? సుఖజీవనమునకు మార్గ । మెఱుగవా
అష్టకష్టములబడి యార్జించినధన
మర్థులకొసగ మదినూహించెనవా ।
సంపాదించిన ధనమును । సాధులకొసగిన
పొట్టకన్నమును నెవ్వరిడుదురిక॥ నెఱు॥

పేజీ 6. పంక్తి 19.

కబీరు——

రామా బ్రోవుమా ! । రఘురామా బ్రోవుమా
నీమృదుపదముల । నెదనిడికొల్చెడి
భాగ్యమొసంగుమా । పావననామా । బ్రోవుమా॥
బాలుడనని మది । దలపోయకుమా
భక్తి తత్వమును ప్రకటనసేయుమా । రామా॥
భక్తలోకపరిపాలనశీలా ! జాలమేలా
కరుణింపగరావా ! ఖగసంచారా ! ॥బ్రోవుమా॥

పేజీ 6. పంక్తి 23.

కబీరు——

పేర్కొనతరమా । రామా !
నీమహిమంబుల పేర్కొనతరమా !
అఖిలజగంబుల । కాధారుడవై
జగములనంటక । సంచరించు నీమహిమంబుల॥ పే॥

ధర్మమునిలుపగ । ధరణిజనించిన
పరమదైవమవు నీవేకావా రామా। నీమహి॥

పేజీ 14. పంక్తి 11.

తమాలు—

దానము చేసితివా । ఖలుడా ।
పొట్టకూటికై । పుట్టెడువగపును
జెందుచుంటిమని । సుంతయోచింపక ॥దా॥
ఐశ్వర్యముతో । నలరెడువారల
మనితలచితివా నీ । మానసమందున। ఖలుడా॥
నాపలుకుల నిటు । లాదరింపకను
ఇచ్చవచ్చినట్లు చరియించెదవా॥ ఖలుడా॥

పేజీ 15. పంక్తి 21.

కబీరు—

ధన్యుడనైతినిగా రామా । ధన్యుడనైతినిగా
తావకదర్శన లాభముచేతను । ధన్యుడ॥
నేటికిట్లు నన్ కరుణింపనెంచియీ
గతిదర్శన మిచ్చియుంటివా । రామా । ధన్యుడ॥

పేజీ 16. పంక్తి 12,

నారాయణశాస్త్రి—

ఇక నుపేక్షింపదగునా !
మతధర్మములు । మంటగలియుచో
జాతియంతయును । సంకరమగుతరి।
సాహసింపక । జాలమొసర్పగ॥ తగునా॥

పేజీ 23. పంక్తి 3.

కబీరు——

రామనామసుధా రసముగ్రోలుడీ
పాపసంఘముల । పాఱద్రోలగా
దగిఁఔషధము । దనివిదీరగాఁ గ్రోలుడీ!
భవరోగంబుల । బాపగజాలిన
దివ్యౌషధమని । తెలివిగలిగిశ్రీ । రామ॥
అజ్ఞానములో । నడలగనేలా
సుజ్ఞానమొసగు । శ్రీరామనామసుధ॥ గ్రోలుడీ

పేజీ 27. పంక్తి 18,

భజనసేయరే !

భక్తలోకపరి పాలకుడగురాముని॥ భజన॥
మతభేదంబుల । మాటదలంపక
అఖిలంబునకా । యాత్మారాముఁడె
శక్తియుక్తుఁడని మదిలోతలచుచు॥ భజన॥
నామరూపరహితుం డాతఁడు
కర్తయు భర్తయుహర్తయుదానై
నెల్లలోకముల నేలెడురాముని॥ భజన॥

పేజీ 28. పంక్తి 9.

నీ గానామృతమున మము దనియింపుమా ! ప్రియా !
హావభావముల నగపరచుచు
మృదుమధురిమమగు గానామృతమున । మము॥
కేళిలోలత దేలుచుండగ
నరుదెంచిన మము । ఆదరించి నీ । గానా॥

పేజీ 37. పంక్తి 11.

కబీరు—

ఆశాజనకములగు భోగంబు
లనుభవించి ముదమందగదగునా!
అఖిలభోగము లస్థిరములని
మదిదలంచుచు । పరమాత్ముని దలపక । ఆశా॥
రాముని నామము । మానకదలచిన
నిత్యానందము చేకూడునుగా । ఆశా॥

పేజీ 46. పంక్తి 24.

కబీరు—

ఎల్లెడజూచిన నీశ్వరమహిమలు
వ్యక్తములగుట యెఱుంగవా ! సోదరా !
ఒక్కచోటనే దైవముగలడా !
ఎక్కడజూచిన నీశ్వరరూపము
గోచరించుటది కనుగొనలేవా ! సోదరా ! ఎ॥
అఖిలలోకముల కాధారుండగు
పరమాత్ముం డొక్కడని భావింపగలేవా । సోదరా!

పేజీ 56. పంక్తి 9.

భజనకీర్తన.

రామభద్రుచరణారవిందముల నమ్మిభజంపుమ । మానసమా॥
పాపభంజనుని । పావననాముని
నిశ్చలభక్తిని నమ్మిభజంపుమా । మా॥

పేజి 62. పంక్తి 20.

సుశీల—

పరీక్షింతువా? రామ॥ పరీక్షింతువా?
నీపదారవిందములె నిరతముగతియని

మానసమున నమ్మియున్న నను । పరీక్షింతువా?
ఈతని వాంఛిత మేవిధి దీర్తును
అతిథిపూజన మెటులొనరింతును॥ పరీక్షింతువా?

పేజీ 67. పంక్తి 12.

వర్తక—

ననురక్షింపుమా ! జననీ
పరమపాతకుడనై యపరాధముచేసిన । నను॥
పూజింపందగు । పుణ్యచరిత్రవు
నీ మహిమెఱుగగ నేరకగోరితి । నను॥

పేజీ 78. పంక్తి 2.

భజనకీర్తన.

రామా రఘురామా ! గుణధామా !
సన్మునివర సన్నుతనామా !
జానకిరమణా । దీనపోషణా
భక్తలోకపరిపాలన ధురరీణా॥ రామా॥

పేజీ పంక్తి 15

కబీరు—

అజ్ఞానములోబడి । యడలగ నేలా
భక్తవరదుడగు రామ । భద్రుచరణాబ్జముల
విడువక దలచుచు । పరముగకీ । అజ్ఞా।
సాధురక్షకుని జానకీనాథుని
నమ్మినవారల కానందము గల్గుగా॥ అజ్ఞా॥
మోక్షదాతయగు । రామచంద్రుడనిన్
స్మరణచేయగను । సద్గతి గల్గును॥ అజ్ఞా॥